కామేశ్వరావు, చిర్రావూరు, 1892-1942

రుధిరప్రవంతినాటకము

చిత్రాడ, 1924

Record no. 563

Kāmēśvarāvu, Cirrāvūru, 1892-1942

Rudhirasravantināṭakamu

Citrāḍa, 1924

Record no. 563

## Bibliographic Record Target

కామేశ్వరావు, చిర్రావూరు, 1892-1942.

రుధిరస్రవంతినాటకము / ఇయ్యది చిఱ్ఱావూరు కామేశ్వరరావు గారిచే రచియింపఁబడినది ; శ్రీ చెలికాని వేంకట ధర్మారావు గారిచే సంపాదింపఁబడినది.- చిత్రాడ : శ్రీ రామవిలాస ముద్రాక్షరశాల, 1924.

(1), v, 48 p. ;21 cm.

Record no. 563

Kāmēśvarāvu, Cirrāvūru, 1892-1942.

Rudhirasravantināṭakamu / iyyadi Cir̲r̲āvūru Kāmēśvararāvu gāricē raciyimpam̐baḍinadi ; Śrī Celikāni Vēṅkaṭa Dharmārāvu gāricē sampādimpam̐baḍinadi.- Citrāḍa : Śrī Rāmavilāsa Mudrākṣaraśāla, 1924.

(1), v, 48 p. ;21 cm.

Record no. 563

---

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB          Date filming began:

# భూమిక.



763

పాఠక మహాశయులారా,

ఉత్కళభాషావిశారదుఁ డగు రావుబహాదూరు రాధానాథ రాయి బి. ఏ. "పార్వతి" యను నమూల్యకావ్యము నుత్కళభాషలో విరచించి యకలంకసుస్థిరయశోధురంధరుఁ డయ్యెను. ఆ కావ్యకథాప్రణాళి ననుసరించి యీనాటకము వ్రాయఁబడినది. గ్రంథమున నుగుణములు స్ఫురించిన నయ్యవి ధీవిశాలుఁడగు నా యుత్కళకవిచక్రవర్తివనియు, దోషములన్నియు నాయల్పలౌకిక లేఖనీజనితములనియు, సరసకావ్యవిచారణదక్షులగు మా చదువరులకుఁ గృతాంజలిబద్ధుఁడనై సవినయనివేదన మొనరించుచున్నాను.

ఈగ్రంథముద్రణభారము వహించి, పెక్కువిధముల మాకు మహోపకారముఁ గావించిన కీర్తిశేషులగు కావ్యనిధి శ్రీచలికాని లచ్చారావుగారి పవిత్రతరాత్మకు శాంతిఁ జేకూర్పఁ బరమేశ్వరునిఁ ద్రిసంధ్యలఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రార్థించువాఁడను.

చేలేశ్వరం,
13-5-24.

విధేయుఁడు,
చిట్టాపూరు కామేశ్వరరావు.

# సంపాదకీయ భూమిక.

మన పూర్వులు పద్యకావ్యములు, పురాణేతిహాసములు, సంస్కృతగ్రంథముల కనువాదముగనో, స్వకపోలకల్పితముగనో, మిశ్రమముగనో, యసంఖ్యాకము లగుగ్రంథములు రచించి లోకమున నసదృశవిఖ్యాతిని శాశ్వతముగ స్థాపించినారు. కాని యిప్పటివారుమాత్రము, పూర్వులరీతిగా వ్రాయఁజాలరా? వ్రాయ కేమి! తమపోటి పరీక్షలయందుఁ దమప్రజ్ఞలను జూపుటకు అట్టిగ్రంథములను వ్రాసినవారు కొంద ఱుండవచ్చును.

పూర్వులు వారిబుద్ధినిబట్టియో, కాలముననుసరించియో, తమ్ముఁ బోషించు ప్రభువులయాజ్ఞ ననువర్తించుటకో, వారు వ్రాసి తమవిధిని నిర్వర్తించి కృతార్థులైరి. ఆకాలమిపుడు రాదు. అట్లు వ్రాయువారును లేరు. చదువువారును లేరు.

సోదరులారా! కొలఁదికాలముక్రిందట పరదేశీయులు మన దేశముపై దండువెడలి మన యమూల్యగ్రంథరాజములను గొంపోయిరి. దోచుకొన్నారు. అమాయకులయొద్దఁ గపటతంత్రమున నపహరించిరి. బలాత్కారముగ లాగికొనినారు. ప్రతిఫల మిచ్చికొన్నారా? ఏమి? ఏసాధనమునైననేమి? ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, మొదలగు దేశములకుఁ గొంపోయి వారివారి భాషలలోనికి మార్చుకొన్నారు. మన సంస్కృతసాహిత్య మంతయు నన్యులు చూఱకొనిరి. ఇట్టి సద్గ్రంథములను విదేశీయులు తమ భాషలోనికి తర్జుమాచేసికొని యేపత్రిక ప్రకటింపఁగా, నాంగ్లేయభాషాపరిచయము గలవా రదిగాంచి యాశ్చర్యపడుచున్నారు. మనపండితుల కాంగ్లేయభాష రాదు. వారేమిచేయుచున్నారు! చేతులను ముడిచికొని, కూర్చుండి చూచుగతి

పట్టినది. ఇప్పటి కవులకు సంస్కృతభాషాపాండిత్యము లేదు. పండితుల కవిత్వము నీరసము. ధనికులకు విద్యలేదు. సాహసౌదార్యములు నశించినవి. విద్యావంతులకు ధనము లేదు.

పూర్వమువలె మనపండితాళి నాదరించి, పోషించుచు, వారిబుద్ధినంతయు నాపనియందే వినియోగింపఁజేసి, మంచి గ్రంథములను వ్రాయించి, భాషాభివృద్ధిఁ జేయఁగల స్వాతంత్ర్యులమగంటిరి. రాజులు లేరా? ఉన్నారు. ఇందుల కుపయోగింపరు. ఏ మాటలకో— ఏ పాటకచేరీలకో... .... ... ...తమవిత్త మంతయు వెద చల్లుచున్నారు. కొందఱు ప్రభువులు పితృవియోగముచే బాల్యమునుండి, యే యాంగ్లేయసంరక్షణముననో యుండి, వారి భాషలు, నాచారములు, సాంఘికమర్యాదలు, నలవఱచుకొనుటచే మనచర్యలయందు, మనమతాచారములయందు—మన పండితులయందు—మన దేశ భాషలయందు—వారి కభిమానము లేదు. అట్టివారు మనకుఁ జేయునదేమి? ఎల్లరు స్త్రీవారలేనా? తమ బుద్ధికి నచ్చినంతవఱకుఁ దాము చేయఁదగినసాహాయ్యముఁ జేయుచునే యున్నారు.

ప్రభుత్వమువారు మన దేశీయులు గాక యన్యదేశీయులగుటవలన, మనవిద్యావిధానము మన యిష్టానుసారముగ లేక భాషాభివృద్ధి కాటంకము గలుగుచున్నదని కొందఱి మతము. వారు విదేశీయులైననేమి? ఎవ్వరైననేమి? వారి స్వభాష యాచరణములోఁ బెట్టిరి. కాని మనభాష చదువవలదని నిషేధించినారా? నిషేధించుచున్నారా? ఎట్టి యాంధ్రగ్రంథము లెవ్వరి కేర్పఱుపవలెనో, సంబంధము కలుగఁజేసికొని వారు చెప్పుచున్నారా? అది మనవారు చేయుచున్న యసంగత ప్రణాళిక గాని మఱియొకటి గాదు. "మనభాషాప్రభావ మెఱుఁగక విదేశభాషాపద్ధతి కలవాటుపడి మన విద్యార్థులు తెచ్చిపెట్టిన యుపద్రవమే కాని వేఱుగాదు." అని కొందఱనుచున్నారు. ఆంగ్లేయభాషావ



రిచితులగుహిందూసోదరులలోఁ గొందఱు మాతృభాషనువిడిచి, ఇంగ్లీషుగ్రంథములనే చదువుదురు. సభలలోఁగూడ నింగ్లీషుననేగాని తెలుఁగున మాట్లాడఁజాలమని క్షమాపణఁగోరువంతటి దురదృష్టము దేశమునకు సంభవించినది. ఆంధ్రమున మాటాడుట, చదువుట, వ్రాయుట, తమ పరువునకుఁ—ప్రతిష్ఠకు—భంగకర మని భావించుచున్నారు కాఁబోలును!

కొందఱు నవీనవిద్యార్థులు పూర్వసంప్రదాయములను, శాస్త్రములను, అవలఁబెట్టి—యతులేల? గణములేల? సంధినిర్బంధమేటికి? ఇన్ని కట్టుబాట్లున్నచోఁ గవిభావ మెట్లు వ్యక్తీకరింపఁగలఁడు?— అని చర్చింప నిరంకుశముగా నుపక్రమించుచున్నారు. వేయేల! ఆంధ్రభాషాపితలగు నన్నయ్య, తిక్కన, పోతన మున్నగువారల గ్రంథరత్నములనే విమర్శించి దూఱుచున్నారు. వారి సద్గ్రంథములయందలి నెఱసులనుమాత్రమే యెంచుచున్నారు. హేళనకూడఁ జేయుచున్నారు.

తిక్కకవి యెక్కడివాఁడు? పొట్టివాఁడా? పొడుగువాఁడా? వెండ్రుకలు తెలుపా? నలుపా? ఎచటనుండి యెచటికేఁగెను? స్థలము మారుటకుఁ గారణమేమి? సంతతికలవాఁడా? సంతతిలేకుండుటకుఁ గారణమేమి? పుట్టనేలేదా? పుట్టిపోయినారా? ఆతఁడు కవిత్వమెన్నవయేఁటఁ బ్రారంభించినాఁడు? మొదటిగ్రంథ మెద్ది? ఆగ్రంథమునందు శివస్తుతియేకాని విష్ణుస్తవ మెక్కడను గానరాదు; కారణ మేమి?—అను చొప్పదంటుప్రశ్నములతో ననవసరప్రసంగములలో మునిఁగి లోకమున కేమియుఁ బ్రయోజనములేని విడ్డూరములు చెప్పుకొనుచు శ్రమ కలుగఁజేసికొనుచుఁ గాలమును గడుపుచున్నారు.

హైందవులారా! మీరు చేయుచున్న భాషాభివృద్ధి, దేశాభివృద్ధి యెవరికొఱకు? ఎందులకు? విద్యావిషయమై పోరాడుచున్న విదేశీయుల

కొఱకా? కాదు ! కాదు !! పామరులకు, విద్యరానిస్త్రీలకు, సుబోధకముగా నుండునట్లు—ఆనందదాయకముగా నుండునట్లు—చదివినవార లితరులను ప్రేరించునట్లు—చూచినవారలు కొనితీరునట్లు—కొనిన వారు చదివితీరునట్లు—ఏదైన నీతిదాయక మగుప్రయోజనము గనంబడునట్లు—వ్రాయవలయును. ఇట్టిగ్రంథములు వ్రాసినం గవుల కుత్సాహము గల్గును.

ప్రస్తుతకాలమున నవలలప్రాముఖ్య మందఱకును విశదమే! అందుం గథాచమత్కృతియుం గల్పనానైపుణ్యమును పాత్రగుణపోషణాదికమును గలిగియుండిన నవలలప్రాముఖ్యముం గూర్చి వేఱుగం జెప్ప నేల? ఈనవలలలోని కథాసందర్భములు చాలవఱకు మన హిందూదేశపు ప్రాచీనకవిగ్రంథమర్యాదలకుం గొంచెము భిన్నముగాం గన్పట్టుచుం జాలవఱకు విచారముతో ముగియుచుండును.

“రుధిరస్రవంతి” యనుసార్థకనామముగల యీనాటకకథాంశములుగూడ నట్టివే. రుధిరస్రవంతి యనంగా, రక్తప్రవాహము. ఈకథయందెల్లెడల రక్తప్రవాహము వెల్లివిరియుచున్నది.

ఇందలి పాత్రగుణపోషణము సమంజసముగ నున్నది. రత్నపుర దుర్గాధిపుం డగునీలాద్రిదేవు ధైర్యసాహసపరాక్రమములును సమయానుకూలరాజనీతియుం జక్కంగా వర్ణింపంబడియున్నవి. గంగేశ్వరుని క్రౌర్యము, పాపాచరణమునకు వెనుదీయకుండుట, పేరాస, మున్నగు దుర్గుణపరంపరలకుం బ్రతిఫలముగ నాతనిరాణి యగుపార్వతి యీశ్వరప్రేరితయై యాతనిం బరిమార్చిన సందర్భమునుబట్టి “అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే” యను సత్యము ధ్రువపడుచున్నది.

నీలాద్రిదేవుపుత్త్రిక యగునన్నపూర్ణ తన శత్రురాజపుత్త్రుం డగుపసంగదేవుం ద్రికరణశుద్ధిగాం బ్రేమించుటయును, ఆమె యాభిజా



త్యమును, వారి పరస్పరానురాగమును రమ్యముగ వర్ణింపంబడి చదువరుల హృదయక్షేత్రములయందుం బ్రేమరసమును జిలుకరించి పదను గల్పించుచున్నది. ఈకవిత్వము నాతికఠినమై, రసవంతమై, కదళీపాకమున నొప్పుచున్నది. ఈగ్రంథము నీతిదాయకముగ నున్నది.

శ్రీయుత చిత్తాపూరి కామేశ్వరరావు బి. ఏ. గారు, ఉత్కళభాషలో, రావుబహద్దర్ రాధానాథరాయి బి. ఏ. గారు రచించిన “పార్వతి” యను నమూల్యకావ్య మీనాటకరూపముగాం దెలిగించి “రుధిరస్రవంతి” అను పేరిడిరి. ఈకవి నీతిబోధకము లగుపెక్కుగ్రంథము లింకను రచియించి యాంధ్రభాషాయోషామణి కానందకారకుండై శ్రీభారతమాత యాశీర్వాదములకుం బాత్రుం డగుంగాక !!!

చిత్రాడ,
25—6—1924.

చెలికాని వేంకట ధర్మారావు.
బార్-ఎట్-లా.



శ్రీరస్తు.

# రుధిరస్రవంతి.

## ప్రథమాంకము.

—:o:—

### 1 వ రంగము.

ప్రదేశము:—రత్నపురదుర్గమున కనతిదూరమున నొక ముక్త ప్రదేశమున శిబిరము.

ప్రవేశము:—వృద్ధకంచుకి.

(తనలో)—రుధిరప్రవాహమున రత్నపురదుర్గము మునిఁగిపోవుచున్నది! శ్రీనీలాచలచూడావతంసము గంగేశ్వరుఁడు మొక్కవోనిపరాక్రమశాలి. వ్రేటున వేయిమంది సాహసవంతుల నేయఁగల యప్రతిహతబాహువీర్యాధికుఁడు; అభిమానధనుఁడు. సైనికులసంఖ్య ప్రవర్ధమానమగుచు నేయున్నయది. మఱియు విజయలక్ష్మి గంగేశ్వరుని సమున్నతభుజపీఠమునఁ దాండవమాడ నువ్విళు లూరుచున్నది!—అబ్బా! రత్నపురదుర్గాధిపుఁడు నీలాద్రిదేవుకూడ పటుసాహసవంతునివలెఁ జూపట్టుచున్నాఁడు. సైనికులు వేనవేలు నాఁడు నాఁటికి రంగస్థలమున నిహతులై పోవుచున్నను, విజయలక్ష్మికటాక్ష మంతకంత కాతని కెడమగుచున్నను, వెనుదీయక, ధైర్యస్థైర్యవిరాజితుఁడై యాతఁడు సంధిప్రశంసయే తలపెట్టఁడు! ఔను. ఆత్మధర్మనిరతు లీపాటికష్టములకు వెనుకంజ వేయుదురా? తండ్రియగువాఁడు తనబిడ్డల సుఖసంపాదనకై ప్రయత్నించుట స్వభావవిరుద్ధ మెన్నఁటికిని కానేరదు.—లేకలేక కలిగిన ముద్దుకుమారునిఁ దగిన వరునకిచ్చి పెండ్లిసేయుటయేకదా, జనకుని పరమధర్మము? ఆధర్మసంరక్షణకై నీలాద్రిదేవు స్వయంవరము చాటించెను. స్వయంవరమంటపమునఁ దనగాదిలికూఁతు రెవ్వని మనోవాక్కాయకర్మల నభిలషించునో యాతని కామెనొసఁగి పెండ్లిగావించుట ఆతని జీవితావధి! అట్టియెడ అనుభవశాలియు, బిడ్డలతండ్రియు నగు శ్రీగంగేశ్వరుఁడు దానే స్వయముగ నామె నాకాంక్షించి పెండ్లియాడ నెంచుట ధర్మవిరుద్ధమై, మనోక్లేశకారణమగుచున్నది. ఔను! పెద్దవారికి పెద్దపొరబాట్లు!—కటకటా! భావిసూచ

నలు కడుంగడు భయంకరముగాఁ బొడకట్టుచున్నవి! లేనియెడ స్వయంవరఘోషణము చాటింపక గంగేశ్వరుఁడు రత్నపుర రాకుమారునిఁ బరిణయమాడ వాంఛింపనేల? నీలాద్రిదేవు అందులకుఁ బ్రతికూలముగా వర్తింపనేల? తత్కారణమున నీసైనికోద్యోగము గలుగనేల? ఆహా! ఎందఱెందఱ శ్రీయప్రస్తుతకలహానలమునఁ బ్రాణ ప్రదాన మొనరించిరి? ఎన్నెన్ని మహోన్నతసుందరప్రాసాదములు విధ్వంసమయ్యెను? ఎడతెగని రుధిరస్రవంతి దుర్గద్వారోద్ఘాటన మొనరించి పారుచున్నది! ఔరా! ఐదేండ్లలో నెట్టి మహాద్భుతపరివర్తనము!—నుట్టుదిమాట కేమి? గంగేశ్వరుని కుమారి కౌశల్య చేసిన మహాపరాధము—అబ్బా! తలంచిన గుండె వ్రక్కలగుచున్నది! ఆమె యప్రతిమానసౌందర్యరాశి! నీలాద్రిదేవుని కేశాకర్షణరూపముగా నెవ్వఁడు గొనితెచ్చి తన పదసరోజముల ముంగలఁ బెట్టఁగలఁడో, యామహావీరున కాజగదేకసుందరి నొసంగి పెండ్లిగావింతునని గంగేశ్వర మహారాజు యుద్ధయాత్రారంభమునఁ జాటించియుండెను. అయ్యో! విధివిధానము! ఆయబల శిబిరప్రదేశమున దేదీప్యమానుఁడగు నొక పురుషునిఁ గనెనఁట! ఇది యేటివింత! పూతకులసంభవుఁడగు మహారాజగర్భమున నీస్వైరిణి. కులకళంకిని యెట్లు లావిర్భవించెను?—పురోహితుల సమాలోచన మనుసరించి చాపలామెను ధవళపర్వతసమీపమున విడిచివచ్చిరఁట! ఆహా! ఎప్పటి కేదివచ్చునో యెవ్వరు చెప్పఁగలరు? హా! విధీ! నీచేత లగమ్యగోచరములు! మహాద్భుతకరములు! అకటా! మహావిషమసమాచారభారనిర్వహమున కేను మిగిలిపోతిని!—రాణీపార్వతీదేవిని నే నెట్లు గాంచువాఁడ? 'నా కౌశల్య సుఖమున్నదే?' యని యామె ప్రశ్నించిన నే నేమని చెప్పుదును?—అయ్యో! అంతఃపురకాంతానివహంబుమధ్య మెలంగవలసిన సుకుమారి కౌశల్య వీరరుధిరాప్లుతశిబిరప్రదేశమున కేలవచ్చెను? వచ్చెనుపో, యేటి కీమహాభయంకరపాపఘటన?—అయ్యో! పార్వతీదేవితో నే నేమని ముచ్చటించువాఁడ?—రాజాజ్ఞమీఱరానిది! నేనిప్పుడే ప్రయాణము గావలయును? యుద్ధసమాచార మాదేవికి విన్నవింపవలయును.—ఏటికో, గంగేశ్వరుఁడు, 'అందఱును శిబిరమున సుఖమున్నవారని రాణితోఁ జెప్పుము' అని నొక్కినొక్కి పలికెను! బహుశః, పుత్త్రికావియోగమున మహాదేవి ప్రాణపరిత్యాగముఁ జేయఁగలదని భయపడియె నేమో?—ఏది యెట్లున్నను ఈ దురంతోదంత మామెచెవిని వేయరాదు!—అదిగో! శ్వేతప్రొద్దు రక్తారుణరేఖల జగంబు ముంచెను. ఆలస్యము సేయక ప్రయాణోన్ముఖము గావలయును.

(నిష్క్రమించును.)

విష్కంభము.

## 2 వ రంగము.

ప్రదేశము:—గంగేశ్వరుని శిబిరమున సభామంటపము.

ప్రవేశము:—గంగేశ్వరుఁ డున్నతాసనమున; మంత్రి; జ్యోతిష్కుఁడు పంచాననజ్యోతిషాలంకారుఁడు; కొందఱు సేనానాయకులు.

గంగే—రక్తరంజితగాత్రి యా కౌశల్య మాట కేమి? మంత్రీ! మన నిరంతర వాహినీసముదయంబుమధ్య నిన్నరాతిరి రుధిరవిప్లవసూచనలు గానుపించెనట! గాఢాంధకారమున రక్తభోజనమాకాంక్షించిన యా రాజవిద్రోహుల దుష్ప్రవర్తనము నాకర్ణగోచరమైనప్పటినుండియు వారిని ముక్కముక్కలుగాఁ గొట్టవలయునని తోఁచుచున్నది! ఔరా! గంగేశ్వరుఁడు జీవించియుండఁగనే సైనికుల కన్నులు నెత్తి కెక్కెనా?

మంత్రి—రాజోత్తమా! మహారాజువారి నామాక్షరములు వినఁబడిన నుద్యోగులలోఁ బిల్లకూడ నేడ్పుచాలించి మిన్నకుండును! మీసమక్షమునఁగాని, పరోక్షమునఁగాని యెవ్వఁడు రాజవిద్రోహి కాఁగలఁడు?

గంగే—అట్లైన నిన్నటి యల్లకల్లోలమునకు హేతువేమి?

మంత్రి—దేవా!

గీ. సమరక్రీడావిశేషక్లేశమ్ము వలన
సైనికావళిపడసెఁ బ్రశాంత నిద్ర!—
అపుడు దుఃఖార్తయైన కృశాంగి యొకతె
కదనరంగంబునందు సాక్షాత్కరించె!

గంగే—(ఆత్మగతమున) కౌశల్య నిరాహారజీవన సోఁపలేక మరణించెనని వింటిని! ఒకవేళ బ్రతికియుండినను ఇం దేలవచ్చును?—(ప్రకాశముగా) మంత్రీ! తరువాత?

మంత్రి—రాజశేఖరా! తరువాతికథ కడుంగడు చిత్రంబు! ఆయువతి మాత్ర భయంకరముగా నాలుక తెఱచి, గుడ్లెఱ్ఱఁజేసి శిబిరప్రదేశమున సంచరించెను! మఱియు,

గీ. రక్తసంలిప్త జిహ్వాగ్రముక్త భయద
జ్వలితజ్వాలాగ్నియందు నిస్తంద్రవిమల

కీర్తివిస్తారులైన సంకీర్ణ సమర
సాహసాధికు లెందఱో సమసినారు !

గంగే—ఆఁ! ఆశ్చర్యమాశ్చర్యము ! ఏమీ ? సైనికు లిట్టి మహాయుద్ధయాత్రావసరమున నంతప్రమత్తులై యుండుటకుఁ గారణమేమి ?

మంత్రి—దేవా! విన్నవించియుంటిని ;—

గీ. పెద్దయుంబ్రొద్దు యుద్ధసంప్రీతు లగుచు
విజయహారాళివడయ దోర్వీర్య మొనర,
శత్రులోకము విలవిల జలదరింపఁ,
బోరి యలసట సుఖశయ్యఁ జేరినారు !

గంగే—మంత్రీ! గూఢచారులును, రక్షకభటులును అప్రమత్తులై యుండవలయునని కదా యాదేశించియుంటిమి ?

మంత్రి—అవును ! గంగకులకలశాబ్ధిపూర్ణచంద్రా ! కాని యాభయోత్పాతమును విలోకించి వారు చెదరి పారిపోయిరి !

గంగే—అబ్బా! తరువాత నేమాయెను ?

మంత్రి—మహారాజా !

గీ. రక్తపానాంతరమున దురంతవదన
అట్టహాసముఁ జేయ, సైన్యాళి కలఁగి,
యడలిపోయెను !

గంగే—(ఆత్మగతమున) ఏమిది !

మంత్రి— అదృశ్య మయ్యె యువతి!—
అల్లకల్లోల మొదవె, రాజాధిరాజ !

గంగే—మంత్రీ ! ఈవింతవృత్తాంతమును నేఁ బోల్పఁ జాలకున్నాఁడ! దీని యర్థమేమి ?

మంత్రి—రాజమార్తాండా ! స్వప్నగతవృత్తాంతమువలె నియ్యది పొడకట్టుచున్నయది !

గంగే—అవును !—పంచాననా ! నీవు సకలశాస్త్రపారంగతుఁడవు ! ఈమహాద్భుతయువతియవతరణమున కేమికారణము ? దీన మనయసంఖ్యసైనికనికాయమునకు హాని చేకూరెడినా ?



జ్యోతి—మహారాజాధిరాజా ! మహాశ్చర్యకరమగు నీయుదంతశ్రవణమున నావిద్యావిభవంబుకూడ కుంగిపోయినటులు దోఁచుచున్నది ! (యోజించి) రక్తభోజనాసక్తమతి యాయువతి నిజమున కొక రాకాసివలె స్ఫురించుచున్నది ! ఎవ్వతయో క్షుత్పిపాసాతిక్లేశమున దుర్మరణప్రాప్తయై యుండనోపు !

గంగే—(తనలో) ఔరా !

గీ. ఎవని పేర్విన్న జగము కంపించు నతఁడు
వీరగంగేశ్వరుఁడు నేఁడు భీరుఁ డగుచు,
నాత్మలోపల భయసంశయములు బొలయ
వణఁకుచున్నాఁడు, వింతయుత్పాత మిదియ !

(ప్రకాశముగా) అలంకారా ! దీని కేమి ప్రాయశ్చిత్తముఁ జెప్పితివి ?

జ్యో—(యోజించి) రాజచూడామణీ ! రక్తాన్నకుంభసహస్రమును గొనిపోయి నిర్జనకీర్ణాటవీతలంబున విడిచిపెట్టవలయును. ఆక్షుదార్త, నిర్భాగ్యయువతి, తదన్నప్రియయై శాంతించును !

గంగే—సరియె, మంత్రీ ! మనపంచాననుఁడు చెప్పినట్లు నీవు జాగ్రత్తచేయవలయును ! మఱియు, (యోజించి) ఆకుంభములను ధవళపర్వతవనతలంబున విసర్జించి రావలయును. (తనలో)

గీ. అన్నపానములకు దూరస్థమై ప్రగాఢ
శోకపరితప్తమై, వీడలేక జగము
విడచె కౌశల్య నిర్జన విపినసీమ !—
అకట ! తలపోయ మిగుల భయంకరంబు !

మంత్రి—రాజచంద్రా ! మహాప్రసాదము ! నేఁడే పంచాననుని యభిమతానుసరముగా జరిగించెదను.

గంగే—(తనలో) అబ్బా !—

గీ. తలఁపులు పలుపాయలగుచుఁ జలన మొందు !
ఖిన్న సైఁబడియెను, మది విన్నఁబోయె !
భీతిగలిగించె బ్రతుకునఁ బెద్ద వెలితి !
క్రుంగిపోవుచుంటి విషము మ్రింగినటులు !

అకటా ! నేనెంతపాపంబున కొడిగట్టితిని !

గీ. నల్లనై కలంచు నాపాపపర్వత
మాకసంబుఁ దోఁచి యరిగె పైకి !—

అబ్బా ! నేనేమిసేయువాఁడ ? కటకటా !

దాని భీషణాకారముఁ దలఁపలేను !
కండ్లు మూసినఁ దెఱచినఁ గానవచ్చు !

మంత్రి—రాజవతంసా ! ఏమట్లు అన్యాయత్తులరై యున్నారు ?

గంగే—(సమయోచితముగా) మంత్రీ ! ఏమియును లేదు ! నీవెఱింగించిన మహోద్భతోదంతమును గూర్చియే యాలోచించుచున్నాను !—పంచాననుఁడు చెప్పినట్లు నీవు తప్పక నేఁడే యొనరింపవలయును.

మంత్రి—మహారాజా ! అటులనే యొనరించెదను. రత్నపురదుర్గమును చూర్ణవిచూర్ణమొనరింపఁ గంకణముకట్టిన మనమాయత్నమున నోకించుక విముఖులమైనట్లు దోఁచుచున్నది !

గంగే—లేదు, మంత్రీ ! నీలాద్రిదేవింకేమిసేయఁగలఁడు ? పొట్టేలు పర్వతమును దాఁకినటులు వాఁడు నిస్తేజుఁడైపోయెను ! అయినను దుర్గమునఁ దినుబడిసామగ్రి పుష్కలముగా నున్నట్లు గానవచ్చుచున్నది !— సేనాధిపతులారా !

గీ. ఫలజలాహారములు, ధాన్యములును మఱియు
సమరసముచితోపకరణ సముదయంబు,
రత్నపురదుర్గమున కేగరాదు ! మీర
లప్రమత్తులరగుచు మెలంగవలయు !

ప్రజలతోఁ బాటు నీలాద్రిదేవుఁకూడ నిరంతరోపవాసవ్రతదీక్షాపరుఁడై వశంబుగాకుండునే ?

సేనా—జయము ! మహారాజా ! జయము ! జయము !

మంత్రి—రాజేశ్వరా ! సమరసన్నాహముత్సాహపూరితంబగునట్లు ప్రసన్నాత్ముఁడవై కదనరంగస్థలంబు నలంకరింపవేఁడుచున్నాను !

గంగే—మంత్రీ ! ఈపాఁటిదాని కింతపరిశ్రమ యేల ? ఎందఱెందఱు నిర్వక్రపరాక్రమోపేతులు నాకచిరకాలములో వశులైరి ?

Note—తే॥ గీ॥, ఆ॥ వె॥ మిశ్రము —భావరసపోషణమునకై యిట్లు రచింపఁబడెను.



గీ. ఒక్క గుండుదెబ్బకు హడలొంది జయపు
రాధిపుఁడు నాపదంబుల వ్రాలలేదె ?
సోలిపడడె భిల్లులతో గుంకసూరుప్రభుఁడు ?
జాబు చూచినమాత్రాన జలదరించి,
జాజపురరాజు సామంతరాజువోలె,
క్లేశమనక కప్పంబు చెల్లింపలేదె ?
మాల్యగిరిరాజు నలగడే మణవక్రింద ?
బహుళఋషికుల్యమొదలు సువర్ణవఱకు
జనపదంబుల నావీరచరణపూజ
నిరుపమాహ్లాదకరముగా జరుగలేదె ?
గంగకుల సుధాకరుఁడు విక్రమయాత్ర
లోకభీభంగకరుఁడు, సుశ్లోకమూర్తి,
వీరగంగేశ్వరుం డని వివిధదేవ
నిలయగర్భములఁ బ్రతిధ్వనింపలేదె ?

మంత్రి—మహారాజా ! మీయసమానపరాక్రమోదంతముఁ గీర్తింపని ప్రాణిగలదా ?

గంగే—(ఆత్మగతమున) అయ్యో ! జగ మెంత గ్రుడ్డిది ? బాహ్యవేషమును నమ్మి మోసపోవు నీవిశాలజగంబు నేఁడు నాకేటికి నరకసదృశంబై చూపట్టుచున్నది ? అబ్బా !

గీ. ఎడమకాలివ్రేలునఁ బీచ మడఁచివేసి
చూర్ణమొనరింతు ననికదా చౌరవతోడ.
ప్రకృతినిర్మితదుర్గ మీ రత్నపురికిఁ,
బ్రబలసైన్యాళి నడపించి వచ్చినాను !

విషమమోహాంధుఁడనై నేనెంత యవివేకినైపోతిని ! అయ్యో !

గీ. సకల రాజులెవనిపాద సన్నిధాన
మున వినమ్రగాత్రులగుచు మ్రొక్కు చేతు

ల సమయనిరీక్షణము సేయ ‡ విసుగుకొనరో,
అట్టి గంగేశ్వరుఁడు దీనుఁడై యనంత
వాహినీయుతముగ నిరు‡త్సాహ మొంది,
క్షుద్రదుర్గముఖంబునఁ ‡ గ్రుమ్మఱంగ
వలసె!—అవమాన మింకేమి ‡ కలుగఁగలదో?

మంత్రి—రాజకులతిలకా! ఇంక పట్టినంతకాలము పట్టను! నీలాద్రిదేవుని పదభ్రష్టునొనరించినఁగాని సమరవ్రతముపరిసమాప్తి మొందదు! వలయు సదుపాయాన్వేషణమున కిదియే యుక్తసమయము.

గంగే—మంత్రీ! నీయాలోచన సమయోచితమై యున్నది. నీలాద్రిదేవుని పదభ్రష్టునొనరించుటగాదు; యమరాజధాని కనుపవలయును! (ఆత్మగతమున) నాకేటికో యుద్ధప్రయత్నమున సంతోషము స్ఫురింపకున్నయది! మఱియు జగన్నాధనగరలక్ష్మీవదనవిలోకనంబున భయమగుచున్నయది! (యోజించి) ఇయ్యెడ యువరాజు అనంగభీముని సర్వసైన్యాధిపతి నొనరించిన జయలాభంబు వడయునగును.—ఆతఁడు నిర్వక్రవిక్రమాధికుఁడు! (ప్రకాశముగా) మంత్రీ! నాకొక యాలోచన బొడముచున్నయది. యువరాజు అనంగభీమదేవు పటుసాహసవంతుఁడు; వీరాధివీరుఁడు. నాచూఁపులో మెలఁగి సమరక్రీడారహస్యము తెలుంగఁగలఁడు! ఆతని నియ్యెడ సర్వసైన్యాధినేత నొనరింపఁ దలంచుచున్నాను!

మంత్రి—మహారాజా! నిజము! యువరాజు నియ్యెడ రప్పించిన బాగుండును.

గంగే—సేవకా! (అర్థోక్తిలో)

మంత్రి—సేవకా! యువరాజమహాశయునిఁ బిలిచికొనిరమ్ము!

సేవ—చిత్తము! (నిష్క్రమించి, అనంగభీమునితోఁ బ్రవేశించును.)

అనం—(తండ్రికిఁ బ్రణమిల్లును).

గంగే—(కుమారునిఁ జూచి, యాత్మగతమున)

గీ. సోఁగగన్నులఁ బొలుపారు ‡ సోయగంబు,
కులుకుమోమున మొలకనవ్వులవిధంబు,
కడుమనోజ్ఞంబునగు ముద్దు ‡ నడకతీరు,
వినయవినమితగాత్రంబుఁ ‡ గనుగొనంగ,



అమల కౌశల్య,—
అయ్యో! ఇంకెక్కడి విమలత్వము!—
పురుషవేషమును దాల్చి
వచ్చినట్టులు బొడకట్టు ‡ భావమందు!
(ప్రకాశముగా) కుమారా! నీ వాయుష్మంతుఁడవు గమ్ము!

అనం—రాజశ్రీరాజాధిరాజా! నన్నుఁ బిలిపించిన కారణ మేమి?

గంగే—కుమారా! రత్నపురపుమట్టడి నేటివఱకు నిరంకుశముగా నెఱవేఱినది! ఇఁక ముందు విజయలక్ష్మీకరగ్రహణమే మిగిలియున్నది! నీవు సైనికానురంజకుఁడవు! సంకీర్ణసమరోత్సాహివి! కుమారా! నేటినుండి సర్వసైన్యాధిపతివై నాకనుసన్న యుద్ధక్రీడావిశేషము లెఱుంగుము! విజయశ్రీవడయఁ బ్రయత్నము సేయుము! నీకు జయంబగునుగాక!

అందఱు—జయము! జయము!! జయము!!!

అనం—(సంతోషపులకితాంగుఁడై) తండ్రీ! ఈగౌరవమునకుఁ బాత్రుఁడనగుటకుఁ బ్రయత్నించెదను.

గంగే—మంత్రీ! నీవామాట మఱువవలదు! పంచాననా! మఱేమియును భయము లేదుకదా? (ఆత్మగతమున) నాకేల భయంబగుచున్నయది? అబ్బా! శ్రీజగన్నాథక్షేత్రమున కేనింక బోఁజాలను! సమస్తభోగవిలాసభానురప్రాసాదమును విముఖమగుచున్నది! శిబిరప్రదేశముగూడ భయంకరమై ఘూర్ణిల్లుచున్నట్లు స్ఫురించుచున్నది!

గీ. ఎంతపనిచేసితిని?—తెల్పి ‡ యెందుఁబోయె?—
ఇంతపాపముఁ జేసి జీవించి యుంటి?—
మృత్యుదేవతకూడ న ‡ న్నాడము జేసె!—
కాలుచున్నాను బరితాపకీలలందు!

నాగతియేమగునో? అకటా! నాహృదయభారము ప్రతినిమిష మధికమగుచునేయున్నది!

గీ. భోగభాగ్యములను పీటికబుచ్చి, చాల
దూరమునఁ బెద్దవేడి మొ‡డారియందు,

నొంటరిగ మనోగతము వెళ్లబుచ్చుకొనఁగ
హాయిగా విలాపించు భాగ్యంబు గలదె ?

అయ్యో ! నాపాపము దారుణస్వరూపమును దాల్చి ముజ్జగంబుల నిండిపోయినది !

గీ. గాలిలోఁ దేలి నాపాపకథ దిగంత
ములకుఁ బ్రాకిపోవును ! ననుఁబోలు పాపి,
యెన్నఁ డెందైనఁ గలుగఁడు ! — ఏమిసేతు ? —
చంపితిని ముద్దుకూఁతును సాహసమున !

అకటా ! నేనధోలోకమునకైన నుండఁదగను ! (ప్రకాశముగా) హా ! కౌశల్యా !

మంత్రి — మహారాజా ! ఏమీ ? కౌశల్యకుమారినిఁ దలంచుకొని దుఃఖించుచున్నట్లున్నది !

గీ. చారుసంపూతగంగవంశంబునందు,
పాలవారాశిలో లక్ష్మివలె జనించి,
తండ్రి తాతల శుభకీర్తి దలఁప కకట !
కులకళంకిని కౌశల్య తొలఁగిపోయె ! —
తెగినవార లెందైనను మగుడువారె ?

గంగే — మంత్రి ! అది యమాయికబాలిక ! అయ్యో ! నేనామెను మఱిచూడఁగలనా ?

మంత్రి — రాజేశ్వరా ! దుఃఖించినఁ బ్రయోజనమేమున్నది ?

అనం — మహారాజా ! కళంకిని కౌశల్యనుగూర్చి దుఃఖించుచుంటిరా ?

గీ. మనకులోన్నతి, గాఢాభిమాన మతుల
గౌరవ మమోఘధైర్యంబు, పారరహిత
ప్రవిమలయశోవిశేషము, పాపమనక
కులట కౌశల్య గంగలోఁ గలిపెగాదె ?

తండ్రి ! ఆయభాగినికై దుఃఖింప నవసరము లేదు ! భూభారము తప్పిపోయెను !

గంగే — (ఆత్మగతమున) అబ్బా !

గీ. విసము పూసిన బాణాల వేఁడివోలె
రాకుమారుని మాటలు సోఁకె చెవుల !



అనృతమును నమ్మి జగము నీకలావనింద,
ముద్దుకౌశల్య తలపైని మోపె నకట !

అనంగ — జనకా ! ఆహతభాగినింగూర్చి మీరు విచారింపవలదు ! మనపవిత్రవంశవృక్ష విషఫలము రాలిపోయినది ! సంతోషసమాచారము గదా ?

గంగే — కుమారా ! అవును ! మంత్రి ! నాహృదయ మేటికి భారమయ్యెను ? — ఇప్పటికి కొలువు చాలింతము !

అందఱు — జయము ! శ్రీశ్రీశ్రీ సంపూతగంగకులకలశాబ్ధిసంపూర్ణచంద్రా ! గంగేశ్వరచక్రవర్తీ ! రాజన్యచూడామణీ ! జయము !! జయము !!!

(అందఱు నిష్క్రమింతురు.)

---

## 3 వ రంగము.

స్థలము:— రత్నపురదుర్గమునకు వెనుకగల తటినీతటమున నుపవనము.

ప్రవేశము :— [రాకుమారి అన్నపూర్ణ, చెలికత్తె మాళవి, పూలదండలు గట్టుచు].

అన్న — చెలీ ! రక్తాశోకహారము మాటకేమి ? ఇది యకారణకలహ మెట్లగును ? ఈభయంకరసమరోత్సాహమున నెందఱెందఱు ప్రాణములు గోల్పోయిరే ! అయ్యో ! ఈరక్తస్రావమున కేనుకదా కారణము ?

మా — రాజపుత్త్రీ ! దేనికెవరు కర్తలు ? ఎవరి కర్తవ్య మెవరు మానఁగలరు ?

అన్న — కాదు, మాళవీ !

గీ. రక్తవాహినీభయదసంరంభమునకు,
భాగ్యసముదాయపూర్ణవిధ్వంసమునకు,
రత్నపురరమాచిరయశోభ్రంశమునకుఁ,
గారణము నాస్వయంవరకలితఘోష !

మా—రాకుమారీ! నీవెంతపొరబడితివి? ఈమహావిపదంధకారమునకు నీశుభస్వయంవర మేనాఁటికిని గారణముగాదు.

గీ. ఎవరి కేవరేఖవంబున నేమి సేయఁ
గలరు? సువిశాలప్రపంచరంగాలయమున
శాశ్వతవినోదకామనాసక్తులగుచు,
ప్రాణు లుత్సహింతురుగాని, పడి నశింత్రు
జ్వలితకాలాగ్నిలో శలభముల వోలె!

కావున కాలక్రమమున నెవరికర్మఫలంబునకు వారి త్రికరణములే ముఖ్యకారణములని గ్రహింపఁగలరు!

అన్న—చెలీ! స్వయంవరముచాటింపకుండిన గడజాతిరాజు లిందఱు విచ్చేసియుందురా? అందఱును పిచ్చుకపై బ్రహ్మాస్త్రమువేసినట్లు మనపైఁ గత్తికట్టవలయునా? అయ్యో! మాళవీ! ఈభయంకరయుద్ధయాత్రావసరమున నెన్నెన్నియుత్పాతము లాపవెను. మొన్ననేకదా గంగేశ్వరుఁడు తీవ్రనిరోధశాసనముఁ బ్రకటించెను. కటకటా! ఆభీషణశాసనప్రచారమున నెంత చెఱుగు వాటిల్లె!

గీ. దుర్గమంబుఁ దనుబడినవస్తువులు లేవు!
నాల్గుదిక్కులు కఠినబంధంబు బడియె!
తత్పురవాసులు కృశించి ప్రాణములను,
గోలుపోయిరి, యెలుకలవోలె నకట!

మఱియు,

గీ. కన్నుఁదోయి కోటరములకరణిఁ దోఁప,
గంటువేసిననైన రక్తంబు లేక,
తులము మాంసములేక, యాఁకలికి సోలి,
అస్థికంకాళములు దిరుగాడు పురిని!

మా—అమ్మా! ఈయుద్ధయాత్ర యింతలో ముగియు సూచనలు గానరావు; యువరాజు అనంగభీమదేవు సర్వసైన్యాధికారము వహించెనఁట! అతఁడు మహాపరాక్రమశాలి!



అన్న—చెలీ! నిజమేనా? యువరాజుకూడను గంగేశ్వరునివలెనే భయంకరత్రికరణములుగలవాఁడు కాఁడుగదా?

(ప్రక్కనున్న లతానికుంజమునఁ గలకలను. అన్నపూర్ణయొడిలో కపోతమొకటి బాణబద్ధమై పడును. అన్నపూర్ణ దానినెత్తి కన్నీటితో)

గీ. ఓ కపోతమా! నీమేన నేసోకి యీభ
యంకరశరంబు జేసె పాపాచరణము!—

అయ్యో!—ఈబాణమును మెల్లఁ బెఱికివేసెదను! (మెల్లన నెడమచేఁతితో దాని మేను నిమురుచు, కుడిచేఁతితో బాణమును దీసి)—అబ్బా! మాళవీ! దీనికష్టము నేఁజూడఁజాలనే!

వేఁడినెత్తురు కన్నీట వెలిసి పోవ,
విషమువేదన భరియింప వీలుగాక,
దీనకలకంఠమున నేడ్చు దీనిఁ గానుము!

మా—(పక్షినందుకొనకయే) అమ్మా! దీనిని సేదదేర్చుదము!

(లోనికరిగి నీరు దెచ్చి యుపచారము సేయును).

[ తెర లో ]

బాలికా! ఆకపోతము మదీయబాణఘాతంబునఁ గ్రిందఁబడియెను. అది నాయధీన మొనరింపవలయును.

అన్న, మా—(ఆలింతురు.)

మా—చెలీ! ఆవీరపురుషుఁడు శత్రుసేనామధ్యమునుండి దారితప్పి యిందువచ్చియుండును! (ఎలుగెత్తి) ఓవీరపురుషా! మీ రిందురావలదు. శిబిరోన్ముఖముగా గమనింపుడు!

అన్న—చెలీ! మర్యాదతెలియనిదానివలెఁ గఠినముగాఁ బలికెదవేమే?

మా—నాకెందుకమ్మా! ఎవరిమనోగత మెవరికెఱుక?

అన్న—(నవ్వుచు) మాళవీ! కోపమా? (జనాంతికముగా) ఆహా! చూడుము!

గీ. వెడదబుజముల మలకలు నెడిన యుంగ
రముల గిరజాలు, మృదువీక్షణములు, రత్న
ఫలకమును బోలు తరళనిస్తుల యురంబు,

అతిభయంకర రక్తశరాసనంబు,
తీవ్రమగు వేటతమకంబు దెలుప, అదిగో!
వీరపురుషుండు కన్నుల విందు గొలిపె!

మా—అమ్మా! పరపురుషుల నట్లు ప్రశంసింపనగునా? ఇదియేకాఁబోలు మర్యాదా విధము?

అన్న—చెలీ! ఎంతకోపము వచ్చెనే?

[యువరాజు అనంగభీమదేవు ప్రవేశించును.]

గీ. లలితమృదులతకూనల వలెఁ జలించు,
క్లాంత సుకుమార కాంతాలలామలార!
ఆశకుంతము దుర్దాంతమైన నాశ
రంబునఁ బడియెఁ, గొనిపోవరాదు దాని!

అన్న—(సిగ్గుబరువున మోమువాల్చి, యాత్మగతమున)

గీ. వాలుగనుల నూనూఁగుమీసాల పొలుపు,
నీటుచూఁపుల పలుకు తేనియల గులుకు,
గనుగొనంగ మనోమోదజనకమయ్యె!
అసమసౌందర్యమున కితఁ డానవాలు!

మా—ఓ మహావీరా! ఇయ్యది శుద్ధాంతరమణీమణుల విలాసవనతలము; మీ కిందు రాఁ బాడియా? శీఘ్రగమనంబున మీశిబిరంబున కరుగఁ బ్రార్థించుచున్నాము!

అన్న—(ఆత్మగతమున)

గీ. అతనిఁ బొమ్మని భ్రూభంగ మభినయించి,
సమయసముచితముగ ముద్దుసకియ బలుక,
ములికివోలెను చెవుల కెంపులకు దోఁచె?
వ్యాధియుతునకుఁ గఠినపథ్యంబు వోలె!

అనం—రమణీమణులారా! నాశకుంతమును నాకొసంగఁ గోరుచున్నాను!

అన్న—(జనాంతికముగా) మాళవీ! అతని నామధేయమాదిగాఁగల యుదంత మడిగి తెలిసికొనుము. (ఆత్మగతమున) ఆహా! ఏమి చక్కఁదనము!



మా—ఓవీరోత్తమా! మాసామాన్యసపర్య లంగీకరించి కొంతవడి యిట విశ్రమింప వేఁడుచున్నాము!

(యువరాజు కూర్చుండును.)

అనం—(మాళవి నుద్దేశించి) ఓరమణీమణీ! ఆకళ్యాణి యెవరు?

మా—ఆర్యా! ఆమె రత్నపుర రాకుమారి!

అనం—(త్రుల్లిపడి) ఆహా!

గీ. బంధురంబగు మృత్యుసంవాదమునకు,
ఇంత రక్తపాతమునకు, నింత ఘోర
విషమవిధ్వంసమునకు, దోర్వీర్యభంగ
మునకు, హేతు వీమోహనమూర్తి యగునె?

మా—ఆర్యా! ఈరుధిరపాతమునకు మారాజపుత్రి యెన్నఁటికిని కారణము గానేరదు. మర్యాదతెలియని గంగేశ్వరుని—

అనం—(అర్థోక్తిలో) అబలా! ఉత్కళసామ్రాజ్యరమానివాసుఁడు గంగేశ్వరుఁడు పరమపూజనీయుఁడు! మాకుఁ దండ్రిసమానుఁడు! మాసమక్షమున నాతని నిందింపవలదు!

అన్న—(ఆత్మగతమున)

గీ. భావపరముగ చీకాకు వడిన మోము,
పడఁతి వేడిమాటల కెంపువడిన చూఁపు,
గలిగి తరళితదరహాస మొలికి పొలయు,
తన్ను దూషించినట్టులు దలఁచుకొనుచు,
కడుమనోహరముగ గానఁబడు నతండు!

మా—ఆర్యా! మీరాజభక్తికి మాధన్యవాదము! నిజము పల్కిన నిష్ఠురమందురు బహుశః మారాజేశ్వరుఁడే దీనికిఁ గారణము గాఁబోలు!

గీ. పెక్కుమొక్కులు చెల్లించి, విసిగిపోయి,
శ్రీమనోహరు కరుణాతిరేకమున నొ
కసుకుమారతనులతాంగినిఁ గాంచి, పెంచి,

భోగసుఖసమార్జన స్వయంవరమునందు,
నడయ నాల్గుదిక్కులఁ జాటఁ బనిచె, నకట!
రత్నపురరాజు ఘోరదుర్మార్గుఁడు గద ?

ఓసర్వజ్ఞా! వైవాహికవిషయములు మనోవృత్తి ననుసరింపవలయును. ఈరక్త సమరమున, బలాధికుఁడగుటవలన గంగేశ్వరుఁడే జయంబుఁగాంచుననుము; ప్రతిఫల మేమికలదు ?

అనం—ఓవనితా! ప్రతిఫలము లేకేమి ? జగద్విఖ్యాతసుందరీమణి లభించును!

అన్న—(ఆత్మగతమున) భంగపాటుకంటె ప్రాణత్యాగము శ్రేయస్కరము!

మా—ఆర్యా!

గీ. తరుణిలభియించెనని పొంగి పొరలరాదు!
ప్రేమశూన్యవివాహము వెలితియగుచు,
విషమపరిణామ మొంది జీవితపథంబు
గప్పివేయును చిమ్మచీకటులయందు!

అనం—బాలికా! నీ వంతరాత్మకవిషయప్రబోధ మొనరింతువు! బాహ్యప్రపంచమున ఘటనావైచిత్ర్యములు నీహృదయాదర్శమున కడమై మఱియు విరుద్ధమై చూపట్టుచున్నవి!

గీ. ప్రాణికోటులమధ్య నిరంతరముగ
సమర మొప్పారుచున్న దీజగమునందు,
బలముగలవారు బలహీనుల జయింత్రు,
ఆత్మసుఖముల పరిపోషణార్థ మబల!

అన్న—(ఆత్మగతమున) ఆహా! ఈమహావీరునిముఖమున రాజశ్రీ వెల్లివిరియుచున్నది!

మా—ఆర్యా! మీపవిత్రనామధేయ మెఱింగించి మమ్ముఁ గృతార్థులఁ జేయ వేడుచున్నాము!

అనం—నన్ను అసంగభీమదేవందురు! శ్రీగంగేశ్వరుఁడు నాతండ్రి!

అన్న—(భయలజ్జాభినయము సేయును). హృదయమా! ఏల కొట్టుకొనెదవు ?

గీ. శత్రురాజకుమారుఁడు మిత్రుఁ డయ్యె!
సమరమున వింతపరివర్తనములు గలుగు!—



అన్నిఁటికి గారణము నేన యగుటఁ, బాడము
చెడుగులన్నియుఁ దలమీఁదఁ బడక యున్నె ?

ఈతనిసందర్శనము నాకనవరతము లభించునుగాక!

అనం—ఓ బాలికా! మీరాకుమారి మాతోఁడ మాటాడదుగాఁబోలు? ఆమెకటాక్షమాలికాబద్ధుఁడనై శరాబద్ధకపోతమునుగూర్చి మఱచిపోతిని.

అన్న—(లజ్జాపాటలిమలో రంజితయగును.)

అనం—(ఆత్మగతమున) ఆహా! ఈమోహనాంగి యెవ్వని వశీకృతఁజేయదు ?

గీ. స్నిగ్ధసువిశాలలంబిత చికురజాల
మునఁ దగులువడి సౌరభములు మనోహ
రముగ గాలిలోఁ దేలి విశ్రాంతి యొసఁగె!—
వనితసాన్నిధ్య మొక దివ్యవరము గాదె ?

(ప్రకాశముగా) ఓరాజపుత్రీ! అనిర్వచనీయానందకరమగు నీసందర్శనమునఁ గృతార్థీభూతుఁడ నైతిని!

అన్న—నృపకుమారా! నీకు నా ధన్యవాద మెఱింగించుచున్నాను! శత్రురాజపుత్రినైన నాయం దుదాసీనము వహింపవలదు!

అనం—ఓరమణీ! నీ నామధేయమేమి ?

మా—ఈసౌందర్యగాత్రికి "అన్నపూర్ణ" యని మారాజా నామకరణ మొనరించెను. కారణము గలదు:—

గీ. వర్షములు లేక మారాజ్యభాగమందు,
కఱవు నాలుగుమూలలఁ బెఱిగిపోయె!
ప్రజలు కృశియించి పెక్కుదుర్గతులఁ బడిరి!
విషఫలంబులుకూడ లభింపవయ్యె!

అనం—అవును! వినియుంటిని, పదునెనిమిదేండ్లక్రిందటి మాట కదూ? అబ్బా! అప్పటిప్రజల దారుణావస్థఁ దలంపనైన శక్యముగానిది!

మా—రాజపుత్రా! ఆభయంకరదుర్భిక్షావసరమున మారాజకుమారి జన్మించెను!

గీ. అపుడు సస్యములు ఫలించె; అఖిలవస్తు
వులు సమృద్ధిగా నెల్లెడ వెలసిపోయె!

ప్రియముగా రత్నపురము సుభిక్షమయ్యె!
వసుమతి హసించె! శాంతిసంపద రహించె!

ఆకారణముననే మారాజు చారుశీలయగు నీరాకుమారికి "అన్నపూర్ణ" యని సార్థకనామధేయ మొనరించెను.

అనం—ఓ వెలఁదీ! మీపరిచయప్రదానమునకు నేఁ గృతజ్ఞుఁడను. దారిదప్పి నేనిట కరుదెంచితిని. నా కపోతమును నాకొసంగినఁ బోయివచ్చెదను.

అన్న—మహారాజపుత్త్రా! మఱల నీసందర్శనభాగ్యము మాకెన్నటికో?

అనం—ఓ మధురగాత్రీ! యుద్ధానంతరమున బ్రతికిబాగుండిన మనము గలిసికొనఁ గలము.

అన్న—ఆర్యా! బాణప్రహారమున నేలకొరిగిన యీశకుంతరక్షణభారము నేవహింపఁ గోరుచున్నాను!

అనం—ఓ సుకుమారవతీ! అటులైన నేఁ బోయివచ్చెదను.

గీ. కులుకుసోయగమందు ముగ్ధుండ నగుచు,
పడఁతి! నీచేతిలో నేఁడు విడచినాను,
పక్షితోఁబాటు నామనోపక్షికూడ,
ఎటులు జూఁతువో నీభార మింకమీఁద!

మా—యువరాజచంద్రా! మీపునస్సందర్శనభాగ్యము మాకచిరకాలములోఁ జేకూరునటులు ప్రసాదింపవలయును.

అనం—కళ్యాణులారా! నేఁ బోయివచ్చెదను!—బాలికా! నీపేరేమి?

మా—నన్ను మాళవియందురు. నేనొక సామంతరాజు బిడ్డను. దిక్కులేని నన్ను నీలాద్రిదేవు గారబమున సంరక్షించువాఁడు!

అనం—సరియే! యువతులారా! ప్రసంగములఁ గాలాతీతమగుచున్నది! నేఁ బోయివచ్చెదను. (నిష్క్రమించును.)

మా—చెలీ! నీ చాతుర్య మేమందును!

గీ. మధురమకరందరసధార మలకలుపడి
మురువునై మెల్లగా వెల్లివిరిసినటులు,
పలుకు తేనియలొలుకుచు వడసినావు
రాకుమారుని హృదయసామ్రాజ్య మబల!



అన్న—చెలీ! ఆపక్షిని జూడవే? మాటలకేమి?

మా—ఓహో! ప్రేమగానమధురప్రదర్శనముఁ దిలకించుచు నేను దీనిమాటయే మఱచితిని!

అన్న—చెలీ! నీహాస్యములకుఁ దుదిమొదలు లేదు! ఈప్రఫుల్లమంజరీనికురంబమును, సలలితమృదులపుష్పహారములను నేఁ బట్టుకొందును. పదవే, మాళవీ! ఈపక్షిని దివ్యౌషధప్రయోగమున సేదదేర్చెదము.

మా—అమ్మా! దారి యిటు!

అన్న—(నలువైపులు జూచి) మాళవీ! ఈసొబగు చూడవే?

గీ. మనవిలాసవనమునఁ గ్రమ్మరుచు నేఁడు
చాలపూవులు గోసి వేసారినాము!
గాని కనులానుదాక చక్కని వినోద
నృత్యపరిహాసములఁ బోల్చు మృదులతాంత
ములు జెలంగెడు నిప్పుడే పూఁచినటులు!

మా—చెలీ! నిజము! మనోవృత్తము లొక్కొక్కమాఱు వింతగాఁ బొడకట్టుచుండును! అమ్మా! చూడుము!

గీ. మధ్యభానుఁడు క్రుంగె!—సమాప్తమయ్యె
ప్రణయనాటకాభినయసంవాద మెల్ల!
గాని యాశ్చర్యకరముగాఁ గానుపించు,
వనతలంబున కిప్పుడే వచ్చినటులు!

అన్న—మాళవీ! హాస్యరసోదంచితమగు నీదరహాసకాంతి కనులం మిఱుమిట్లుగొలుపుచున్నది! పదవే, ఆలస్యమయ్యెను!

మా—చెలీ! నీవదృష్టవంతురాలవు! రాజ్యేశ్వరివైనప్పుడు నన్ను మఱచిపోయెదవు సుమా?

అన్న—మాళవీ! నన్నేటికిఁ దూలనాడెదవు?

మా—అమ్మా! దారి యిటు నిటు!

(నిష్క్రమింతురు.)

---

శ్రీరస్తు.

# రుధిరస్రవంతి.

## ద్వితీయాంకము.

—:o:—

### 1 వ రంగము.

[ప్రదేశము :—దుర్గమున శుద్ధాంతము.

[ప్రవేశము :—అన్నపూర్ణ శయ్యాతలమున.

అన్న—ఆహా ! ఆమనోహరరాజకుమారుఁడు నాస్మృతిపథంబున వెలుంగుచునేయున్నవాఁడు !

గీ. రాజసము, తులలేని పరాక్రమంబు,
విపులసౌందర్యరాశిలో వెలిగిపోయి
తొలుక నిలువెల్ల, రాజపుత్త్రిందు దోఁచె,
నవ్యసుకుమార వీరమన్మథుని వోలె !

ఆహా ! ఆతనిసుఖస్వరూపము నేనెట్లు మఱువఁగలను ?

గీ. తరళదరహాసచంద్రికాస్ఫురణ గలిగి,
కనుగెలందుల మధురవీక్షణము గలిగి,
పలుకుపలుకునఁ బ్రేమసంపదలు గలిగి,
రాజకుమారుని వదనచిత్రింబు, నాహృ
దంతరాళమున లిఖితమయ్యెఁ బోలు !

ఆప్రియశీలుని పునస్సందర్శనభాగ్యము నాకింకెట్లు చేకూరెడిని ?

గీ. అతఁడు శత్రురాజకుమారుఁ డగుట, సమర
వ్రతనమాప్తమునఁ గలియవచ్చు ననుచుఁ



బలికె !—కటకటా ! యంతటి భాగ్యపదవి
గలుగునో యీభవంబునఁ గలుగదొక్కొ !

అయ్యో ! ఏటివెట్టి ! బలాధికుఁడు గంగేశ్వరుఁడు సమరదీక్షాదక్షుఁడు ! జయశ్రీ యాతని కనుకూలవతి ! నన్నాతఁడు విడిచిపెట్టునా ?

గీ. వీరగంగేశ్వరుఁడు నన్ను విడువ డెపుడు !—
నే ననంగభీమునిఁ బాయ హృదయమందు !—
భీతహరిణంబు సింగంబువాతఁ బడియె !
మరణమే నాకు కడసారిశరణ మింక !

[ప్రవేశము:—నీలాద్రిదేవు.]

నీలా—(జనాంతికముగా) ఆహా ! సుకుమారగాత్రి నాయేకపుత్రి శివవసుఖాభావమూహించుచున్నది ! ఆమె హృదయానందసంవర్ధనమేకదా నాపరమావధి ?—ఓరీ ! గంగేశ్వరా ! ఎంతటిక్రూరుఁడవు ? సైన్యబలాధికుఁడవై నాయిల్లుఁ గాల్పసాహసించితివి ! కానిమ్ము ! ఇంతలోనేమాయె ?

అన్న—(తండ్రినిఁజూచి నిలువఁబడును).

నీలా—అమ్మా ! అన్నపూర్ణా ! ఏమనుచుంటివి ? "మరణమే నాకు కడసారిశరణమింక !" అనికదా ? కటకటా ! నీయమాయికసుస్నిగ్ధసుందరలలాటమున నాకలన విధాత యట్టిదుష్ప్రాప్తి లిఖియించెనా ?—బాలికా ! నేఁ డెట్టిదుర్దినము !

గీ. నిన్నుఁ గనుగొంచు దుఃఖంబు లన్ని మఱచి,
బ్రతికియున్నాను కాలస్రవంతిఁ దేలి,
ప్రబలదుస్సహదుఃఖవారాసియందు
నీవు మునిఁగిన నాప్రాణ మేటి కమ్మ !

అన్న—తండ్రీ ! అన్నపూర్ణ హతభాగిని ! దానికై దుఃఖింపకుము !

నీలా—అమ్మా ! నే జీవించియుండఁగనే ?

అన్న—జనకా ! దుర్గద్వారమునఁ జెలరేఁగుచున్న సమరవహ్ని మఱి చల్లారదు ! గంగేశ్వరుఁడు వెనుదీయఁడు !

నీలా—అమ్మా ! వెనుదీయకుండినను భయములేదు ; నాకంఠమునఁ బ్రాణమున్నది !

అన్న—తండ్రీ! నామనోభిప్రాయ మాలింపుము: ఈయుద్ధ మింతటితో ముగించుట సర్వశ్రేయస్కరము!

నీలా—అది యెట్లగును? చక్రవర్తిని నీవు పెండ్లాడ నూహింతువా?

అన్న—లేదు! స్థలాంతరమునకే నరిగిన నన్నియుఁ జక్కఁబడును!

నీలా—అమ్మా! నీ వెటకేగుదువు?

అన్న—గీ. ప్రాణు లెట చిరవిశ్రాంతి వడయఁగలరు?
ఎచట దుఃఖము తలచూపఁ డించుకైన?
ప్రణయదేవతానిలయమై వరలునెద్ది?
ఆమనోహరసీమకే నరుగుదాన?

నీలా—బాలికా! ఇవియేటిమాటలు? దైవము మనకు సహాయ మొనరింపఁగలఁడు!

అన్న—తండ్రీ! ఒకవేళ దైవసహాయమున మనకు జయమే లభియించుననుము; అందున లాభమేమి?

నీలా—నీవు త్రికరణశుద్ధిగా వివాహిత వగుదువు!

అన్న—అది యెన్నఁటికిని కానేరదు! నామనం బాయత్తమైనది!—

నీలా—ఎట్లు?

అన్న—మనలీలావనమున అనంగభీమదేవునకు హృదయార్పణముఁ గావించితిని.

నీలా—(తలవంచి, యోజించి) అన్నపూర్ణా! విధివిధాన మిట్లున్నది! సరియె! మంత్రులతో యోజించి, సమయోచితకార్యవిధానమునకుఁ గడంగెదను!

[ తెరలో ]

రాజపుత్రీ! పూజాద్రవ్యములు విరజాదేవీపుణ్యాలయమున సిద్ధపఱిచితిని. నీ వింక స్నానమునకు రమ్మా!

నీలా—అమ్మా! మాళవి పిలుచుచున్నది!—నీవు దుఃఖింపకుము! నీ కచిరకాలములో సుఖప్రాప్తి యగునుగాక!

(నిష్క్రమింతురు.)

---



## 2 వ రంగము.

### శిబిరమున సభామంటపము.

ప్రవేశము:—గంగేశ్వరుఁడు, మంత్రి, సేనాధిపతులు.

గంగే—మంత్రీ! దుర్గాంతరమున నీలాద్రిదేవ క్షుధార్తుఁడై మాడిపోయెను! జగదేకలావణ్యవతిని రత్నపురిరాజపుత్రిని నాచరణసమీపమున నర్పింపకుండిన వానిఁ బ్రాణములు దక్కనిత్తునా?

గీ. వాడి బెడిదంపువాలున వ్రక్కలయ్యు,
కనులు మిఱుమిట్లుగొలిపి భీకరముగాఁగ,
రత్నపురరమానాథు శిరంబు తూలి
పడి మునుంగదె రక్తప్రవాహమందు!

సేనాధిపతులారా! మనమింక నిరంకుశముగా దుర్గద్వార ముద్ఘాట మొనరింపవలయును. ఆపిఱికిపంద నీలాద్రి యెచ్చట తలదాచుకొనునో చూచెదంగాక!

సేనా—మేలు! రాజేశ్వరా! మేలు! మేలు!! కరాళమృత్యుముఖమునఁగూడ జొరబడుటకు సన్నద్ధులము!

మంత్రి—రాజచూడామణీ! అదిగో! సంధిపతాక చేఁబూని యెవ్వఁడో రాయబారి యిటు వచ్చుచున్నట్లున్నది!

[రాయబారి ప్రవేశించును.]

గంగే—ఓయీ! నీ వెవరు?

రాయ—రాజశేఖరా! నీలాద్రిదేవుపంపున నేనరుదెంచితిని. యుద్ధప్రయత్నము నుండి పరాఙ్ముఖుఁడై రత్నపురరాజు నన్నిటకుఁ బుత్తెంచెను.

గంగే—ఏటికి?

రా—మహారాజా! ఆతనిసందేశమును గొనితెచ్చితిని.

గంగే—ఆసందేశ మెట్టిది?

రా—గంగకులపావనా! శ్రీగంగేశ్వరచక్రవర్తీ! మారాజు సందేశ మిదిగో! సావధానముగా నాలింపుము!

గీ. నాకుమారిని గోరి దుర్నయకఠోర
కదనవ్యాపారమున నీవు గడఁగినావు!—
రత్నపురరాజ్య మంతయు భ్రంశమయ్యె!
ఇరుగెలంకులఁ బ్రాణాపహరణ మయ్యె!—
మొక్కవోని పరాక్రమమూర్తి వీవు,
తెలియవా కన్నబిడ్డలవలని సుఖము?—
నెమ్మనోపూర్వకంబుగ నీకుమారుఁ
గోరుకొన్నది నాముద్దుకూఁతు రిపుడు,
వారి భావిసుఖముఁ గోరువార మగుట,
సమరవ్రతసమాప్తము సమంజసము సుమ్ము!
సమరశాత్రవభీమ, యో సార్వభౌమ!

సంగే— (తనలో) ఆహా! "తెలియవా కన్నబిడ్డలవలని సుఖము?" అనికదా, నీలాద్రి కబురంపెను?—కటకటా! కన్నకూఁతును దిగమ్రింగిన కఠోరహృదయమున వాత్సల్య మెక్కడ?—(ప్రకాశముగా) ఓరాయబారీ! ఈవక్కవినయముల కెక్కడికి? నామాటగా నీలాద్రితో నిట్లు పలుకుము:

గీ. ఎంకమాటల కాలయాపనము వలదు,
సంధియత్నంబులను బ్రయోజనము లేదు,—
కూఁతునిత్తువో, నిలువున వాఁతఁ బడెదో?
నిమిష మవకాశ మొసఁగితి నిశ్చయింపు!

రా— రాజన్యశిరోమణీ! ఇంత కాఠిన్యమా?

గీ. ప్రవిమలప్రసన్నమై యాకారణము నగుచు,
ముద్దులొలయుచు, మాధుర్యపూర్ణమగుచుఁ,
బారు ప్రేమవాహిని కడ్డుపడఁగ రాదు!
విషమపరిణామమందుఁ గల్పించుఁ గాన!

సంగే— (ఆత్మగతముగ) కటకటా! వీనిపలుకులు ములుకులై మర్మస్థానములు భేదించి మృత్యుయాతనఁ గలిగించుచున్నయవి! ఆహా! తనూజాతయైన నేమాయె?



ప్రప్రథమమున నాకామెయెడఁ గలిగిన ప్రేమ యెంతమాధుర్యమై, మనోహరమై, యుండెనో, యంత్యమున నంతవిషమాత్మకమై, భయంకరమై, పొడకట్టె! హా! ఈ నిరంతరమనోయాతన యెట్లుపశమించును? రత్నపురరాజపుత్రినిఁ గోరికదా, నే నీతపయాపమున కోర్చితిని?—(ప్రకాశముగా) ఓరాయబారీ! నాజిహ్వ తిరుగనేరదు!—

రా— ఓసార్వభౌమా! మాన్నృపుని కడసారిమాట యాలింపుము.



గీ. ప్రాణమునకంటె నధికతరంబు గాగ,
ప్రేమతోడుత నాకూఁతుఁ బెంచుకొంటి!
కఠినహృదయంబుఁ దాల్చి లోకాలకైన,
అననుగుణవయోవంతున కొసఁగఁజాల!

సంగే— ఔరా! నీలాద్రి! ఎంతపొగరుబోతుతనము! వాచాటా! ఇంతయైనను దర్పోద్ధతి యణఁగలేదా? నన్నకర్మణ్యునిగా, ముసలివానిఁగా నెత్తిపెట్టుదువా?

గీ. వీరగంగేశ్వరుని ప్రతాపారుణాగ్ని,
ప్రబలశాత్రవధ్వంసకృపాణధార,
మఱచెఁ గాఁబోలు నింతలో వెఱపులేక!—
లేడు నీలాద్రి జగతిలో లేడు లేడు!

సైనికులారా! దుర్గమున దాగుకొని నిష్ప్రయోజనవాక్ప్రసంగముల మనల కను బ్రామసెంచిన యాదురాత్మునివధింప నిదిగో కరవాలము నిష్కోశ మొనరించితిని!

గీ. అంతిపురమున మహిళాసభాంతరమునఁ
బిఱికిగుండియ గవ్వు భీకరప్రలాప
ములఁ గడఁగిన యబలుఁడు మోసగాఁడు!
అస్మదీయకృపాణధారాగ్ని కెడసి,
యడరి పరుగెత్తి, లోకంబు లందు నెచట,
చెనఁటి తలదాఁచుకొనునో చూచెదముగాక!

లెండు! సైనికులారా! లెండు! మీమీ [illegible]న కిదియే పరమోపయుక్తసమయము!

గీ. రత్నపురదుర్గమున నగ్నిన్ ప్రాకవలయు,
కోటగోడ లగడ్తలన్ గూలవలయు,
రాజు తల నాపదంబులన్ వ్రాలవలయు,
ఇంచుకంత నే నపుడు శాంతింపవలయు!

అదిగో! సేనాని యువరాజు పరమోత్సాహపరిపూరితాంతరంగుఁడై సైన్యమధ్యమున మెఱసిపోవుచున్నాఁడు! రత్నపురదుర్గమును రేణుపటలిగా నెఱపి విచ్ఛిన్నమొనరించెదను!—

(నిష్క్రమింతురు.)

---

3 వ రంగము.

[ ముక్తకేశిని మాళవి, శోకార్తయై ప్రవేశించును. ]

హా! అన్నపూర్ణా! మనోహరసుఖస్వరూపిణీ! నీ వింతలో నింతదారుణపరిణామ మొందుదు వని యెవ రెఱుంగుదురు? హా! దురాత్మా! గంగేశ్వరా! నీ వెంతకటికివాఁడవు? అమాయిక వాత్సల్యానుబంధమున నీకెదురైన మా రాజన్యుని వధించి, యాతనిపూఁతరక్తమున నీకలుషితహస్తప్రక్షాళము, గావించితివా? అయ్యో! నీహృదయము దురంతదారుణమయంబై, లోకభీకరకరంబై పరమకళ్యాణి మారత్నపురరమామణి కీనాఁటికి వైధవ్యప్రాప్తి ఘటింప జేసెనా? కటకటా! నిరుపమానరూపాభిమానవతి, మనోహరలక్ష్మీస్వరూపిణి, జగదేకమనోహారిణి, మా యన్నపూర్ణ తనచిగురుచేతులొగ్గి నిన్ను వేఁడుకొనునప్పుడైన నీయమానుషహృదయమునఁ గరుణావేశము గలుఁగదయ్యెనా? ఆయమాయికబాలిక విద్యుల్లతాపరిశోభిత నవమేఘలక్ష్మీవలె నీలాంబరధారిణియై నీపదముల వ్రాలి కలకంఠకాకలీస్వరమున దన గారాబుజనకుని ప్రాణప్రసాద మర్థించునప్పుడైన నీకఠినమనోతలమున నించుక దయగలుగదయ్యెనా? హా! గంగేశ్వరా! మహావీరులు కరుణాభరణులని జగత్ప్రసిద్ధము! నీవు వీరుఁడవు గావు; నరరూపమున నవతరించిన రక్కసుఁడవు! రక్తాంజలి నీమనోమోదకరము; హా! హా! నీదుర్భారమున, విశ్వధాత్రి వసుంధర యెట్లు క్రుంగిపోవదయ్యె?



“హా! రత్నపురలక్ష్మీసనాథా! మధురాపత్యస్నేహమూర్తివి! కన్నబిడ్డవలె నన్నుఁ జూచువాఁడవు! కటకటా! నీవంటిపుణ్యాత్ముని పరిరక్షణ నాకింకెట్లు లభింపఁగలదు?

హా! రాజపుత్రి! అన్నపూర్ణా! మూర్ఛాధీనవైన నిన్ను క్రూరగంగేశ్వరుఁడు గొంపోయెను! నీయభిమానభ్రంశముఁ దలంచు నాపాపాత్ముని బారినుండి నిన్నెవరు రక్షింపఁగలరు?—అయ్యో! నీకు మరణమే శరణము!—

పాపము! అనంగభీముఁడు—ప్రేమమూర్తి—మనకనుకూలముగా మాటలాడియుఁ దిరస్కృతుఁడాయెను! హా! హతభాగినీ! అన్నపూర్ణా! నిన్ను మఱి నేఁ జూడఁగలనా? అయ్యో! అయ్యో! ఎంతలో నెంతఘటిల్లెను! హా! దుర్భరము! దుర్భరము!!

(మూర్ఛిల్లును.)

---

శ్రీ రస్తు.

# రుధిరస్రవంతి.

## తృతీయాంకము.

—:0:—

### 1 వ రంగము.

[చంద్రశాలాచూళమున కంచుకి యాసీనుఁడై.]

ఆహా! ఎంత చెప్పరాదనుకొన్నను అభయంకరోదంతము రాణీపార్వతీదేవికి నివేదింపవలసివచ్చెను! కౌశల్య కులటయని యామాతృదేవికి తెలిసిపోయినది! మహావిభవోదంచితహంసపురమున మహారాణి దుఃఖితయైపోయినది! శోకకీటక మనన్యకాశలమున నీ సుమవనప్రవేశ మొనరించెను!

ఇన్నిదినము లెడతెగనిపోరాట మైనను శత్రుపదమున రత్నపురపతి శిరంబువంచఁడయ్యె! అయ్యో! శిబిర మనుకంటకవనమునఁ గౌశల్యాసుందరి, జగన్మోహిని శిరీషసుమంబువలె రాలిపోయెను!—

అదిగో! రక్తారుణరవిబింబ మస్తమించెను! కౌముదీధౌతసాగరము, విరళతరళతారకాగుంఫితసునీలగగనతలము, నేత్రపథమును ప్రశాంత మొనరించుచున్నవి!—

ఔరా! వీరసింహగంగేశ్వరుఁ డెంతక్రూరుఁడైపోయెను! పాపము, కర్మభూమి వసుంధరావలయమున భుజబలాధిక్యమునంజేసి చిరస్థాయి నగుదునని యాతఁడు తలపోయుచున్నాఁడు! అనుక్షణమును కేవలపరపీడనానురతుఁడు! ఉత్కళసామ్రాజ్యమంతయు నాతనియేలుబడిక్రింద కంపించిపోయినది! ఇంతక్రూరుఁడు మఱి జన్మింపఁడు!—

ఎందఱెందఱు రాజులు గతించిపోయిరి! ఏపృథివీపతుల విమలకీర్తి మేఖలానుశోభితయై యుత్కళసామ్రాజ్యలక్ష్మి ప్రసన్నయయ్యె, ఆమహామహు లేరీ! నీలాచలసంస్థాపనగార్యోత్తీర్ణుఁడు, పాపపర్వతవజ్రి, ఉత్కళరవి, ఇంద్రద్యుమ్న మహీపతి యిప్పుడేడీ? అతని సువర్ణసౌధము నవనిధానవిరాజితమై యొప్పారుచుండెను! కట



కటా! ఇప్పుడయ్యది జీర్ణమై, వ్యాఘ్రభల్లూకావాసమై పోయెను! ఆస్ఫటికశిలాభిత్తికలు శైవాలాచ్ఛన్నములైపోయెను! కామినీవదన ప్రఫుల్లకమలాభిశోభితము లగువాతాయనపథంబులు క్రిమితంతుజాలములచే బంధింపఁబడియెను! మణిదీపమాలికావిలసితశుద్ధాంతరమణీయప్రదేశములు తిమిరాచ్ఛన్నములైపోయెను! ఆహా! ఇంకెన్నెన్నిరాజ్యములు కాలప్రవాహమున మునిఁగిపోయెను! గంగేశ్వరుఁడుమాత్రము శాశ్వతముగా నిలచిపోవునా!—

అబ్బా! ప్రకృతీదేవారంగమును జీవన్నాటికి విడచి పోయినట్లున్నది! ఈనిశ్శబ్దనిశీధము నాకేటికి భయంబుఁ గలిగించుచున్నది?— నెలదినములైనది దుర్నిమిత్తములే చూచుచున్నాను! మాటిమాటి కెగసివచ్చి యాస్థానమండపమున గృధ్రము వసించుచున్నది! ప్రతిరాత్రియు నెన్నెన్నియో యుల్కాపిండములు నభోమండలమునుండి జారిపడుచున్నవి! చంద్రశాలాచూళమున గుడ్లగూఁబ లఱచుచునే యున్నవి! నిశాంతమం దంతఃపురమున అబలారోదనమువలె నొకానొక వికలధ్వని వినవచ్చుచున్నది! ఆధ్వని యెందుండివచ్చునో యెవ్వ రెఱుంగఁజాలరు!—ఆహా! ఈమహోత్పాతదృశ్యదర్శనమున భయోత్కంప మగుచున్నది! భావిపరివర్తన మెట్లుండునో దురవగాహము!

(నిదానించి చూచి) అదిగో! ఉత్తరదిక్కున పూర్ణధ్వజతారామండలముక్రింద జ్యోతిర్పుంజ మగపడుచున్నది! ఓవహ్నిశిఖా! నీకు స్వాగతము! నీవు శుభసందేశహరుఁడవు?—

ఈజ్వలితాగ్నికి హేతు వేమి? (యోచించి) బహుశః, సాలకాష్ఠములను పేర్చి దండదేవీవిలాసార్థము కొండకోయలు మంటబెట్టి కౌతుకసంగీత మొనరించుచున్నారు కాఁబోలు!—కాదు కాదు! యోగులు విజయసంకేతార్థము వహ్ని పేర్చియుందురు! అవును! రాజన్యుని కుశలమున రాజ్యకుశలము! రాజు రాజ్యకర్ణధారుఁడు!—

ఆహా! దోళోత్సవవిజయదివసమున విజయోత్సవము కలసిపోవును! ఆహా! ఆనంద మానందము!—

నే నిప్పుడే పోయి మహారాణికీశుభవార్త నెఱింగించెదను!

(క్రింది కరుదెంచి, భయముతో ముందుఁ జూచి)

ఆఁ! అదియేమి? (నిశ్చేష్టుఁడై కొంతవడికి) హా! కౌశల్యా! కౌశల్యా!—అయ్యో! మహోత్కళీకౌశల్య!—హా! ఆయాకారమే! అయ్యో! అప్రఫుల్లభావ

మీ ముఖమున మాయమైపోయెను! అయ్యో! అయ్యో! కేవలవిషాదరేఖవలెఁ జూపట్టెను? కౌశల్యా! పరమసుందరీ! కౌశల్యా! మాటాడవేమి? అనికుంజచ్ఛాయాతిమిరమునఁ గలసిపోతివా?—అబ్బా!—మహారాణి కివ్వార్త నివేదించెదను!

(నిష్క్రమించెను.)

---

## 2 వ రంగము.

### అంతఃపురము.

[ ప్రవేశము:—రాణీపార్వతి. ]

పా—ఛీ! ఏమిజన్మమెత్తితిని!—హా! కౌశల్యా!

గీ. పుట్టినింటికిఁ గార్చిచ్చుఁ బెట్టినావు!
కులము గీర్తియు గంగలోఁ గలిపినావు!
తిరముగా వంశమున మచ్చఁ దెచ్చినావు!
దుఃఖినీ! దుఃఖమునఁ దేలి తొలఁగినావు!

ఛీ! స్వైరిణీ!

గీ. ఉత్కళాకాశమున వెలుఁగొందుచున్న
యిందుబింబంబు వీరగంగేశ్వరుండు,
అతని శ్రీముఖమందు దురాత్మురాల,
ఎడసిపోవని మచ్చఁ గల్పించినావె?

హా! హా! ఎంత దారుణకృత్యమునఁ గొడిగట్టితివే? ఛీ! పాపీ!

గీ. వ్రేలిచూఁపున జగముల నేలఁగలుగు
అఖిలశుభలక్షణాంగున కవతరించి,
ఇంతపాపము సేయు నే నృపకుమారి,
అనుచుఁ బుణ్యాంగనలు మనోవ్యాకులమునఁ
జేతులను గర్ణపుటములఁ జేర్చినారు!

హా! పుత్త్రీ! మనోహరగాత్రీ!

గీ. ముద్దులూరఁగ, ఏనోట ముద్దుబిడ్డ!
కన్నకూఁతురా! సుకుమారగాత్రి! యనుచుఁ



పిలచినానో, యానోటఁ, బాపి! కులటా! య
భాగినీ! యని నినుఁ బిల్వవలసె నకట!

అయ్యో! నీవింతటిదారుణమున కియ్యకొందువని యెవ్వరుదలంచిరి? అమాయికురాలవు! జగమెఱుఁగని చిన్నిబిడ్డవు! కౌశల్యా! ఈనింద్యవర్తనము నీకెవరు గఱపిరమ్మా!—కటకటా! దరవికసితారుణపద్మంబువలె మనోహరమునై చూఁపరుల నయనంబుల సుధాంజనముఁ బెట్టునీముఖమును నేమఱువఁగలనా!—కుమారీ! నిన్ను మఱి నేఁ జూడఁగలనా?—పాపాచరణమునకు సౌందర్యము సృజింపఁబడలేదు; అని జ్ఞానులు చెప్పుదురు. ఆసుజ్ఞానసూక్తియందు నా కెంతయో నమ్మకముండెను! అయ్యో! నీసుచారుచంద్రవదనము విశ్వజనమనోహ్లాదకరము! నీయమాయికముఖదర్పణమున వినయము, కారుణ్యము, లజ్జాధిక్యము ప్రతిబింబితములగుచుండెను! అమ్మా! కళంకసాగరమునఁ గులమును ముంచి, నీవు మునిఁగిపోతివా? హా! నీకర్మ మింతదారుణపరిణామ మొందునని యెవ రెఱింగిరి?

(ఆలయమునుండి సంధ్యాసమయఘంటావాద్యధ్వని వినఁబడును.)

ఇప్పుడు హారతి సమయ మయ్యెను!—ఓదేవతాసార్వభౌమా! జగన్నాథా! కులటనుగన్న తల్లిని! నీనామోచ్చారణ సేయుటకైనఁ దగను! తండ్రీ? నన్ను క్షమింపుము!

[కంచుకి ప్రవేశించును.]

కంచుకి—రాజ్యేశ్వరీ! రాజదూత నగరుప్రవేశ మొనరించి, శ్రీవారి సందర్శనార్థము వేచియున్నాఁడు!

పా—వానిని నాసమక్షమునకుఁ దోడ్కొనిరమ్ము!

కంచుకి—మహాప్రసాదము. (లోనికరుగును)

పా—యుద్ధభూమినుండి వీఁ డింకెట్టివర్తమానముఁ దెచ్చునో కదా! హా! నిర్భాగ్యురాలనగు నాకీభవంబున సుఖంబు లేదు!

[కంచుకి దూతతోఁ బ్రవేశించును.]

దూ—(వినయమునఁ దలవంచి, రాణికి నమస్కరించి) ఓరాజ్ఞీశిరోమణీ! నేనిప్పుడు సార్వభౌముని సందేశమును గొనివచ్చినాఁడ!

పా—ఓయీ! ఆసందేశ మెట్టిది?

దూ—మహారాణీ! రత్నపురము విధ్వంసమయ్యెను! రత్నపురపతి నిహతుఁడయ్యెను! రత్నపురరాకుమారి అన్నపూర్ణ శ్రీవారిదివ్యపాదసేవ జేయును! రేఁపు పూర్ణిమ! చక్రవర్తి విజయశ్రీసమేతుఁడై పురప్రవేశ మొనరించును!

పా—ఓరాజదూతా! నీశుభసందేశమున కెంతయు సంతసించితిని. నీవీయమూల్యసువర్ణాభరణమును గ్రహింపుము. (ఒసంగును.)

దూ—(అందుకొని, వంగి నమస్కరించి, వెడలిపోవును.)

పా—కంచుకీ! నేను చాల పాపాత్మురాలను! నాకీభవంబున మఱి సుఖములేదు! నేఁ దలయెత్తఁ జాలను!

కంచుకి—అమ్మా! ఇటు లధైర్యపడఁ దగునా?

పా—అమాయిక కౌసల్య ఎంత చేసెను!—కంచుకీ! మాతృహృదయరహస్య మెఱుంగుదువు! కులటనై దగ్ధమైపోయిన కౌశల్యను గూర్చి హృదయము కొట్టుకొనుచున్నది! కటకటా! మధురవాత్సల్యభావము నాయెడ నొక తీవ్రశాపరూపమునఁ బరిణమించినది!—హా! కౌశల్యను మఱి నేఁ జూడఁగలనా?

కంచుకి—అమ్మా! అనువర్ణగాత్రిని నే నిప్పుడే చూచి వచ్చితిని.

పా—కంచుకీ! ముసలివాఁడవు! కష్టసుఖము లెఱుంగుదువు; నన్నేటికి హాస్యమాడెదవు?

కంచుకి—అమ్మా! నేనామెను చూచితిని! ఆఛాయామూర్తి మకరోద్యానమున నికుంజచ్ఛాయలో నంతర్ధానమయ్యెను!

పా—కంచుకీ! నిజమేనా! నాకామె కానఁబడునా?

గీ. ఏ మనోహరముఖము వీక్షించినంత,
పలుకులకు రానిసంతోష మొలియు నేఁడ,
ఆయమాయికముఖము జన్మాంతరమున
నైనఁ గనులారఁ జూచుభాగ్యంబు గలదె?

కంచుకి—తల్లీ! ఆమె ముఖమున విషాదరేఖఁ జూచితిని! ఆముద్దుబిడ్డ యిందునే తిరుగాడుచున్నయది!

పా—కంచుకీ! నీవింకఁ బొమ్ము! నామనంబు భారమాయెను! ఎంత పాపినైనను కూఁతురుగదా?

(నిష్క్రమింతురు.)

---



[మకరోద్యానమున మాధవీమంటపమున కెదురుగా,
ప్రవేశము:—రాణీపార్వతీదేవి]

పా—ఆహా!

గీ. ప్రాణు లందఱు గాఢవిశ్రామ మొంది,
హాయిగాఁ జేరినారు నిద్రాంకపాళి!—
లేశమాత్రము వెడలు ఝిల్లీరవంబు,
కలఁతనిద్దురఁ బొర్లాడు కడలి యేడ్పు,
దప్ప నెందైన నొండేమి ధ్వనియు లేదు!—

ఈలతానికేతనచ్ఛాయలో నామె యదృశ్యమాయెనని కదా కంచుకి చెప్పియుండెను?

(అస్ఫుటరోదనధ్వనివిని) హా! ఏమది?

గీ. నల్లరాళ్లైన గరగర వెల్లివిరియ,
శాకలీస్వనమున మెత్తగా, నితాంత
కరుణరసవంతమైన యాక్రందనంబు,
బడిమె వీనుల నెందుండి వెడలు చెపుమ?

(నిదానించిచూచి) అబ్బా! ఆరోదనధ్వని నామనోగతమును గంపింపఁజేయుచున్నది!—హా! హా! పుత్త్రి!—

గీ. ఆహవతలంబునకుఁ బోవు నవసరమున
మోము మోమునఁ జేర్చి, యేమేమొ పలికి,
కంటఁ దడిపెట్టి నన్ను వీడ్కొంటివి సుత!—
కఠినవిధివ్రాలు!—నీకలకంఠ మాల
కింపఁ గలిగితె నెన్నాళ్లకిపుడు మరల!—

(మండపమునునిదానించిచూచి) ఓ, అస్పష్టనారీమూర్తీ! నీవెవరు? పాదరసశలాకవలె చంద్రాలోకమున విషాదమేఘాచ్ఛాదితవదనవై కన్పట్టుచున్నావు!

[కౌశల్య ప్రేతరూపమున మంటపసీమఁ గానఁబడును]

కౌ—అమ్మా!—అమ్మా!—అమ్మా!—

పా—హా! కౌశల్యా!—ఎందున్నదానవే?

కౌ—భవయవనికాపారమున!

పా—హా! నిష్కళంక రాజకులమునఁబుట్టి యిట్లైపోయితివా?

కౌ—తల్లీ! నాజన్మమునకు ధిక్కారము! రాజకులమునకు ధిక్కారము! ధిక్కారమాలోకసమ్మానమునకు!—

పా—ఛాయారూపధారిణీ! నీ వీదుర్గతి కెట్లువచ్చితివి?

కౌ—అమ్మా! నాదుఃఖగాథ నీవాలింపఁజాలవు! నీహృదయము పగిలిపోవును!

పా—అయ్యో! కళంకినివైపోతివిగదే!

కౌ—అమ్మా! నీవునిజమెఱుంగవు! రత్నపురముట్టడివృత్తాంతము నామనోగతమును గాల్చివేయుచున్నది!

పా—తల్లీ! ఏమాయెనే?

కౌ—కన్నీటితో నీలాచలమును వీడ్కొలిపిన కొలఁదిదినములలో రాజవాహిని రత్నపురదుర్గమున కనతిదూరమున నిలచిపోయెను. శిబిరతలమున పితృరాజసేవయందు నా దినములు గడచిపోవుచుండెను. భూరమణునినిమిత్తము సురభిళకుసుమహారంబులను గ్రుచ్చియిచ్చుదానను! నామధురవీణాఝుంకారము రాజేంద్రునకు శ్రవణోత్సవమొనగూర్చుచుండెను!—

పా—కూతురా! నీపితృభక్తి నే నెఱుంగనా? తరువాత!

కౌ—ఒకనాఁడు రాజేంద్రుఁడు నిండుసభాంతరాళమున మహోన్నతహేమసింహాసనమధిష్ఠించెను! సామంతరాజపుత్త్రులు బరివేష్టించియుండిరి. నేను సర్వాలంకారభూషితనై సార్వభౌముని పదసమీపమున సింహాసనసోపానమున నుపవసించితిని!

పా—అవును! రాజేంద్రుఁడు నిన్నుఁ దనబహిఃప్రాణముగాఁ జూచువాఁడు! తరువాత?

కౌ—ఆసమయమునఁ జక్రవర్తియెలుంగెత్తి యనియెను. "ఓరాజసింహులారా! సౌందర్యపూజ, సౌందర్యమూల్యము వీరపురుషులకే యెఱుక! సుందరీమణుల వీరులయెడ ననుకూలవతులు కార్యభూమియందు వాగ్వీరులును కర్మవీరులును గలరు! క్షేత్రకన్య, లీలాసుందరి, కౌశల్య వచ్చియున్నది! రాజపుత్రులు పరాక్రమాతిశయమును బ్రదర్శింపవలయును!"



పా—తల్లీ! జగదేకవీరుని నల్లునిగా వడయ నెంచుట వీరాధివీరుఁడగు శ్రీరంగేశ్వరునకుఁ జెల్లును! నీశుభోదయమభిలషించి యాతఁడట్లు ప్రకటించెను!

కౌ—ఆనాఁటఁగోలె శిబిరాధిదేవతవలె నన్నెల్లరును బూజింపసాగిరి! రాజేంద్రుఁడును నన్ను మిక్కిలి గారాబమునఁ జూడసాగెను; నాకమూల్యబహుమానములర్పించెను.—అమ్మా! వేయు నేల? నీవుచెప్పినట్లు నన్నుఁ దనబహిఃప్రాణముగాఁ జూడఁదొడంగెను!—నాసుఖసంపాదనకార్యతత్పరుఁడైన జనకునివడసిన నాపూర్వసుకృతంబును మెచ్చుకొంటిని!

పా—అయ్యో! కూఁతురా! ఎంతకృతఘ్నురాలవైపోతివి! ముద్దుచేయుజనకునకుఁ దలవంపుఁగలుగఁజేసితివి!—హా! విధివిధానము!

కౌ—అమ్మా! నన్నుదూషింపకుము! నేను పాపాత్మురాలనైనను నిరపరాధిని! అయ్యో! తల్లీ! తలఁచుకొనిన నాయీఛాయాశరీరముగూడ కంపించుచున్నది!—ఆదురంతోదంతము నే నెట్లు చెప్పఁగలను?—అమ్మా!—

పా—కూఁతురా! ఏలనేయట్లు వలవలయేడ్చెదవు? ఏమిజరిగెను?

కౌ—అమ్మా!—ఒకనాఁటిరాత్రి రాజేంద్రుఁడు దరస్మితవదనుఁడై నన్నడిగెను, "అబలా! అసమానలావణ్యప్రతిమను పరాధీనమొనరింపఁదగునా? అంతకంత కాతని మాటలు నాహృదయమును కోసివేసెను! తల్లీ! నాయభిమాన మాతఁడు...గ్రహించెను!...నిరంతరదుఃఖప్రదమగు నీపితృదత్తాపమానము నే నెట్లు సహింతును! తల్లీ! నాదుఃఖమును నీకు నివేదించి, కాలసింధునీరమున నాపాపప్రాణమును ముంచివేయఁదలంచితిని! గర్భవతినైన నన్నుఁజూచి, రాజేంద్రుఁడు కపటకోపమున నెల్లరితో, కౌశల్యకులట! గుప్తప్రేమమున గర్భవతియయ్యె నని నన్నుఁ గారాగారమున బంధించెను! కొన్నాళ్లకు అబ్బా!—అబ్బా! తల్లీ! చెప్పఁజాలనే!—మూడుమూర్తుల రాజేంద్రునిఁబోలు కుమారుఁ డొకఁడు నాగర్భమున నవతరించెను!

పా—(రోషకషాయితనేత్రయై) తరువాత?

కౌ—వానియందుఁ దననిజాకృతిఁగాంచి, వెఱగొంది, రాజేంద్రుఁడు పాపచిహ్నమునుగప్పివేయ నెంచి, నన్ను శిశుసమేతముగా, దుర్గమారణ్యపథమున, ధవళగిరిప్రాంతమున కంపివేసెను! తలవరులు మమ్మొకగోతిలో నిలువఁబెట్టి మామీఁద నొకచాపతాయిఁ గప్పివేసిరి! తాతిసందునుండి యొక్కింత వెలుఁగు మాత్రమా గోతిలోఁ బడుచుండెను!

పా—హా! హా! ఎంతపాపమెంతపాపము!

కౌ — అమ్మా! ప్రాణములతో నేను శిశువునెత్తుకొని సమాధిలోఁ గొంతకాలముంటిని! అకటా! నాపాపప్రాణములను దీయ నొక్కపామైన నాగోతిలోఁ గానఁబడదాయె! నేత్రయుగమున నశ్రువు లెండిపోయెను! హా! ఏధవళశైలశృంగమున విశ్వోద్ధారకుఁడగు శ్రీయశోకరాజన్యుని యక్షయాక్షరపాళి దృశ్యమానమగుచుండెనో, యేస్థలంబున సుప్రసన్నగంభీరదయాప్రవాహము కలకలస్వనమునఁ బారుచుండునో, యాప్రదేశమున ఓమాతృదేవి! నేను భవవ్రతోద్యాపన మొనరించితిని!—

హా — కూఁతురా! బాలుఁడేమాయెను?—

కౌ — నేమరణించుటకుముందు బాలుఁడు క్షుధార్తుఁడై చనిపోయెను! కొంతసేపటికి నామనోవేదనకంటె ఆకలిబాధ శతగుణితమాయెను! అప్రయత్నముగా నాశిశుకళేబరమును నోటఁ జేర్చితిని!—

హా — హా! హా! (చెవులుమూసుకొనును.)

కౌ — జాతిసందునుండి నాయమానుషకృత్యమును సహస్రగవ్వారవదనుఁడైన పర్వతరాజశిరోభాగమున మిలమిలలాడు తేజఃపుంజనక్షత్రము జూచుచుండెను! ఆకీర్ణాటవియందు, కఠినశిలావితానముక్రింద, అంధకారబంధుర బిలప్రదేశమున, పరమపాపదేహమును విసర్జించితిని!—జననీ!—నేఁబోయెదను!—అదిగో! తొలికోడి కూయుచున్నది! మహోదధితరంగముల భేదించి యుషశ్శిఖర మింతలోఁ గానవచ్చును!—తల్లీ! నేనిందుఁ బడయరాదు! ప్రత్యూషమున నీలాచలధామమందువారితవిధానముఁ దిలకింప దేవరాజు ఇంద్రుఁడు నిలింపులతో వేంచేయును! ప్రేత లాసమయమున నీపుణ్యస్థలమున మెలఁగరాదు!—అమ్మా! నేఁబోయివచ్చెదను, నన్ను మన్నింపుము!—జన్మజన్మాంతరములందు నాకు నీవంటి సుధామయిజనని లభించుఁగాక!—నావంటిదుఃఖిని నీపూఁతగర్భమున మఱి కలుగకుండును గాక! అమ్మా! పోయివచ్చెదను!—అమ్మా!—అమ్మా!—అమ్మా!—

హా — హా! హా!—అశ్రుతఘటన! ఘోరదుస్స్వప్నమా!—హా! కౌశల్యా! కౌశల్యా! (మండపము వైపుఁ పరుగెత్తును. కౌశల్య అదృశ్యమగును) అయ్యో! సుకుమారీ! మఱినీవు నాకగపడవా?—హా! స్వప్నప్రాయమునవచ్చి స్వప్నప్రాయముననడచిపోతివే?—కుమారీ! ఎంతదారుణమయ్యెనే?—ఓ, అహిపతీ! నీఫణాగ్రమీదారుణభారముక్రిందఁ గ్రుంగిపోవదయ్యెనా?—ఓ క్షేత్రపాలా! విశ్వనాథా! నీత్రిశూలము విచ్ఛిన్నమైపోయెనా! ఓవజ్రీ! నీయస్త్రాగారమున వజ్రాయుధము మాయమయ్యెనా? ఓయమధర్మరాజా! నీధర్మాధర్మవిచక్షణ మండి



పోయెనా? వ్యోమపథమున సర్వసాక్షిరూపమునఁ దిరుగుచున్న గ్రహనక్షత్రములారా! మీజ్యోతిర్మయమున నీపాపచ్ఛాయబడలేదా?—ఓజగన్నాథా! ఆర్తభంజనత్వమే నీపతాక! ఆమహాభయంకరసమయమున నీవెందుంటివి? నీయమోఘచక్రము మానవరూపపాపరాక్షసునిమ్రింగివేయలేదా? ఓమహాబాహూ! సకలజగన్నాథా! నీశ్రీముఖప్రీతి వచనము నాసంశయమును హరింపఁగలదు! తండ్రీ! చెప్పుము! ఈదురంతఘోరఘటన నీవెట్లుసైరించితివి?—

హా! కౌశల్యా! తెలియక నిన్నుఁదూలనాడితిని! అయ్యో! నీచిన్నారిముఖము నే మఱిచూడఁగలనా? నీసుధాసంసిక్త వాక్యాళి నే మఱివినఁగలనా? నీసశీతలాశ్లేషసుఖము నేఁబడయఁగలనా?—తల్లీ! నీవెంతకష్టమునకోర్చితివే?—హా!! హా! నాపున్నెములగంప, నాముద్దుముచ్చట, నాయమాయికకౌశల్య, నాకింక గానరాదు!—హా! హా! దుర్భరము! దుర్భరము!!

(మూర్ఛిల్లును).

---

శ్రీరస్తు.

# రుధిరస్రవంతి.

## చతుర్థాంకము.

—:-o-:—

### 1వ రంగము.

[రాజప్రాసాదసమీపమున అనంగభీమదేవు ప్రవేశించును]

ఆహా! కాలమెట్లుమారిపోయినది? రత్నపురదుర్గావరోధసమయమున గిరినదీతీరస్థితకేళీవనాంతరమున నే నేసుకుమారమనోహరగాత్రికి హృదయార్పణముఁగావించితినో, యామెపవిత్రతము శరత్కాలమేఘశలాకవలె వైవర్ణ్యమొంది గంగేశ్వరునిహస్తగతమైపోయెను! ఆమెకునాయెడఁగల మనోనురాగబంధమెఱింగియు, నాతండ్రియించుకైన యోజింపఁడయ్యె!—ఓమానవసంఘమా! నీకుధిక్కారము! ఓసృష్టికర్తా! నీనిర్మాణకౌశలమునకు ధిక్కారము!

గీ. అతివ యనుకూలవతియైనఁ బతి యరాతి,
అతివ ప్రతికూలవతియైనఁ బతి సఖుండు,
వనిత కోరినపురుషుఁ డుద్వాహితుండు,
పురుషుఁ డభిలాషపడుకాంత యొరునిసొమ్ము!
ప్రేమ యన్యోన్యమేని దుఃఖవిధమువడును!
అంతరాయము లగును దుఃఖాంతముగను!—
ప్రేమయందునఁ దీయని విసము గలదు!
ప్రణయరసహీనజగము విశ్వధ్వంస మగును!

హా! ప్రేమభావ మెంతదురవగాహము!

గీ. సర్వసామాన్యమైన యాశ్చర్యశక్తి,
అతులశీతలమైన శోకాగ్నికీల,



పరమసుఖ వారిరాశిలోఁ బాడబాగ్ని,
సృష్టిలోపలి వైచిత్ర్యఁసీను ప్రేమ!—

విచారించిన లాభమేమున్నది; మానవుఁడు విధిచేతి కీలుబొమ్మ! హా! విధీ!—దుర్విధీ!—నీ వెట్లుద్రిప్పిన నట్లు దిరుగవలయును!

గీ. అవనిలోపల సర్వశ్రేయస్కరంబు,
కర్మనాటకభరతవాక్యంబు, దురవ
గాహము నగువిధి, యొకింతఁ గరుణ లేక,
ఎందులకునీడ్చు మనల నంఁ దేగవలయు,

అదిగో! ఉదయమార్తాండుని బాలకిరణావలి ప్రాగ్జ్మ్రలమున, నూర్మిమాలాకలిశోభితరత్నాకరమున మెఱయుచున్నది! దిగంగనలు సువర్ణశృంఖలలచే సువర్ణకలశములతో నీరుచేదుచున్నట్లు దోఁచెడిని పద్మవనమున కమలినీనయనహిమాశ్రుబిందువులను సానురాగమున సూర్యుఁడు దుడిచివేయుచున్నాఁడు! మర్త్యవైకుంఠమీ జగన్నాథక్షేత్రము కనువిందుగొలుపుచున్నది! శ్రీగంగేశ్వరుఁడు విజయాంకుఁడై పురప్రవేశ మొనరించును. ఆమహోత్సవముననేఁగూడ సముచితవాహనారూఢుఁడనై విజయపతాక ధరింపవలయును! (ముందున కుపక్రమించును; విజయదుందుభిమ్రోఁగును) ఆహా! విలంబమైపోయెను! నేనింక తడయరాదు!

(నిష్క్రమించును.)

---

### 2వ రంగము.

సింహద్వారసమీపసౌధోపరిభాగము.

ప్రవేశము:—రాణీపార్వతీదేవి; వృద్ధకంచుకి.

కం—అమ్మా! అవును! అదియే రాజవాహిని! అదిగో! అతఁడు బోదరాజు; గంభీరవేదిపై నెక్కి వచ్చుచున్నాఁడు! మహానదీతీరమున వేణుకీర్ణాటవీపరివేష్టితదుర్గమీతనియావాసము!

పా—కంచుకీ! అతనివెనుక నాజానేయ మెక్కి వచ్చువారెవరు?

కం—రాజ్యేశ్వరీ! అతఁడు అనుగళరాజు; మహానదీతటమున గిరిదుర్గ మాతని సుధర్మ; అతని రాజ్యము ప్రశస్తాశ్వములకుఁ బ్రసిద్ధికెక్కినది!

పా—(తనలో) ఈపుణ్యపురుషు లేల పాపావతార మగు గంగేశ్వరుని గొలుచుచున్నారు!—(ప్రకాశముగా) కంచుకీ! ఆతనిప్రక్క నగ్రేసరుఁడగు నాతఁడెవఁడు?

కం—దేవీ! ఆతఁడు తాళచరాధిపుఁడు! బ్రహ్మ, చక్రవాకినీనదీజలంబు లీతని కాననవేష్టితరాజధానీపాదధౌత మొనరించుచున్నవి! నిండుగడ్డములును, గఱిమీసములును గల సైనికు లీతనిఁ గొలుచువారు! ఆతని పతాకమధ్యమున పింగళోజ్జ్వలజ్వాలామయహింగుళాచిహ్న మున్నది!

పా—కంచుకీ! ఈరాజులందఱును రత్నపురదుర్గము నిన్నాళ్లవఱకు భేదింపఁ జాలరైరా?

కం—అమ్మా! తీవ్రముగా యుద్ధ మెన్నఁడును జరుగలేదు! ఐదేండ్లును విలాసక్రీడానిరతులై సైనికులు సమరోద్యోగమునవించుక ప్రమత్తులై యుండిరి!

పా—అవునవును!—కంచుకీ! ఆతఁ డెవఁడు

కం—ఆతఁ డుత్తుంగమాల్యగిరిరాజు! పరశుహస్తులై యాతని సైనికులు భయంకరముగా నడచుచున్నారు!

పా—పక్షిఱెక్కలతలాటములు దాల్చిన చిత్రాంగసైన్యసమేతుఁడై వచ్చు నాతఁ డెవఁడు?

కం—అమ్మా! ఆతఁడు బాణపురరాజు. చిలకాసరోవరపరివేష్టితజలదుర్గమున నాతఁడు నివసించును!—దేవీ! అటు చూడుము! శూలాయుధపాణులై, శార్దూలచర్మాంబరధారులైన కాల్బలముతో బాంకిరాజు వచ్చుచున్నాఁడు!

పా—ఆహా! ఎందఱెందఱు రాజన్యులీక్షుద్రసమరదీక్షాతత్పరులైపోయిరి! పిచ్చుకపై బ్రహ్మాస్త్రము!

కం—అమ్మా! ఆతఁడు బడంబారాజు! బృహదంబికాపాదసిందూర మాతనియేనుఁగుల ముఖమున మెఱయుచున్నది!—దేవీ! ఆళిరాజును చూడుము! ఈతని యవొఘనౌకామాలవరుణుని నీలరాజ్యమును సంక్షుభిత మొనరించుచుండును! వివిధదేశాగతులగు వణిజులీతనికి మంచి ముత్యములును, చిత్రవిచిత్రములగు గవ్వలును, సుగంధచందనకాష్ఠములును, కానుకగా నర్పింతురు!

పా—(తనలో) ఆహా! ఇట్టి రాజులమధ్య గంగేశ్వరుఁడెట్లు తలయెత్తఁగలిగెను? (ప్రకాశముగా) కంచుకీ! ఆతఁ డెవఁడు?

కం—ఆతఁడు సంజయరాజు; జనమేజయవంశధరుఁడు! ఆతని షడ్ద్వారగడమునుజుట్టి నిసర్గపరిఖారూపమున విరూపానది ప్రవహించుచున్నది! దేవీ! ఇటుచూడుము!



విరిజాదేవీ పదారవింద భజనానందమతి, కేసరివంశవంశధరుఁడు, జాజపురరాజు! ఆతని రాజ్యలక్ష్మిమృదుచరణములను వైతరణీనది ధౌత మొనరించుచున్నది!—అమ్మా! భిల్లయోధులతో గుంగూరుగా జదిగో! వచ్చుచున్నాఁడు!—దేవీ! నీవు భాగ్యవతివి! మహదైశ్వర్యవిభూషితుఁడగు సార్వభౌముని జేపట్టిన పుణ్యవతివి!

పా—(తనలో) అల్లదే! సామాన్యకృషికపత్నులు! ఆహా! నాకంటె వారే భాగ్యవతులు!

కం—దేవీ! ఇదిగో చూడుము! సువర్ణశారకావిలసితమును, రక్తారుణమయూఖమునగు పల్లకిలో శ్రీవీరగంగేశ్వర చక్రవర్తి వచ్చుచున్నాఁడు! యువరాజు పంచకల్యాణి గుఱ్ఱముపై నెక్కి వీరరసాధిదేవతవలెఁ గన్పట్టుచున్నాడు!

పా—ఆతని వెనుక వచ్చుచున్న పల్లకి యెవరిది?

కం—దేవీ! అందు బహుశః రత్నపుర రాకుమారి యుపవసించియుండును!

పా—కంచుకీ! నేనిప్పుడేపోయి లాజాంజలీపురస్సరముగా రాజేశ్వరునకు స్వాగత మొసంగవలయును! రాజవాహిని సింహద్వారమును సమీపించెను!

(క్రిందికి నిష్క్రమింతురు.)

---

## 3 వ రంగము.

హంసపురద్వారసమీపమున

ప్రవేశము:—సఖీమండలితో రాణీపార్వతీదేవి.

[అన్నపూర్ణ పల్లకిదిగి యామెకాళ్లపైఁ బడును.]

పా—ఓరత్నపురరాకుమారీ! అన్నపూర్ణా! లెమ్ము! తల్లీ! ఈమహిళాపద్మవనమున నవాంభోజినివలెఁ గన్పట్టుచున్నావు! బ్రహ్మమానసపుత్రివలె మనోహరముగానున్నావు! కావ్యతారవలె ముద్దులొలుకుచున్నావు! తల్లీ! చారుతర భూషణాంబరములకు వన్నెఁ దెచ్చుదానవు! భూతలమున కవతరించిన చంద్రరేఖవలె, వనాళులఁ గ్రుమ్మఱు సీతాసతీమణివలె, కాళిందీపులినమున శ్రీకృష్ణవిరహిణి రాధాదేవివలె కరుణాసముద్రమథనమున నవతరించిన అరుణాధరలక్ష్మివలెఁ జూపట్టుచున్నావు!—ఓనీలాంబరధారిణీ! నీముఖమండలమున సంతోషలీల గనఁబడదేమి? నిరంజననీలోత్పలనయనములేటి కశ్రునదీయొను? వెచ్చనిట్టూర్పుల సోఁకున నీబింబాధరము వైవర్ణ్యమొందెను!—బాలికా! లెమ్ము! నీమనోగతదుఃఖము నాకెఱింగింపుము!

అన్న—ఓరాజమాతా! నారూపము నభినందింతువు! నాయీరూపమునకు ధిక్కారము!

ఈరూపము కారణమున రత్నపురదుర్గము కాలగర్భమునఁ బడిపోయెను! తల్లీ! నేను భాగ్యహీనను! మాతృహీనను! కటకటా! పితృహీనను!—నీవు మహాభాగ్యవతివి! ఆశ్రయహీననైన నాకన్నీరు దుడుచుటకైన నెవ్వరును లేరు!—నన్ను లాలించి పాలించిన జనకుని జీవనకుఠారమనై యాతని ఋణమును దీర్చుకొంటిని! నేనిప్పుడు దుఃఖప్రవాహమునఁ దేలివచ్చి నీపవిత్రచరణాశ్రయమును జేరితిని—తల్లీ! పితృమాతృహీనను! అనాథబాలికను! నీశ్రీచరణసామీప్యమున నాకాశ్రయమిమ్ము!—

—(ఆమెను లేవనెత్తి, కన్నీరుదుడిచి) చారుశీలా! అన్నపూర్ణా! నీవు కరుణాప్రతిమవు! నీవదనేందుమాధురిఁ దిలకింప నాహృదయము నీరై పోయినది! రత్నపురరత్నోత్తమా! భయములేదు! నీవృత్తాంతమంతయు నేనాలించితిని! నీవింకలోనికరుగుము! (అన్నపూర్ణమహిళాజనసంఘముతో నిష్క్రమించును.)

[గంగేశ్వరుఁడు ప్రవేశించి గట్టువాలునొకతెను దగ్గరకుఁ బిలిచి]

గంగే—ఓసీ! రత్నపురరాకుమారిని ప్రమోదభవనమునకుఁ గొనిపోయి సముచితభూషణాంబరములచే నలంకరింపవలయును. నేనందు రాఁగలను!

గట్టు—రాజోత్తమా! మహాప్రసాదము! (నిష్క్రమించును.)

గంగే—(ఉపక్రమించి) ఆహా! అదిగో, పూర్ణచంద్రుని ఆరక్తమూర్తి సాగర నీలోర్మిమాలికలఁ బ్రతిఫలించి తేలిపోయెను.

(పార్వతినిసమీపించును; లాజాంజలియొసఁగి రాణియాతనిని సత్కరించును.)

గంగే—ఓ నారీశిరోమణీ! సమగ్రోత్కళరాజ్యము శ్రీగంగేశ్వరుని పాదానతమాయెను! గంగేశ్వరుఁడు నీపాదానతుఁడాయెను! (దరస్మితమొనరించి) దేవీ! రత్నపురరాజు గర్వాంధుఁడై నాక్రోధానలమున శలభమైపోయెను!—శ్రీజగన్నాథదేవభక్తుని గతిరోధమొనరింప నెవనిసాధ్యము? నీవిప్పుడు సహచరనారీసమేతవై మకరోద్యానవనమున నన్నుఁగలియవలయును! మనము క్రీడాయుద్ధమున నొండొరుల నెదుర్కొనవలయును! (నవ్వును.)

పా—(నవ్వుచు) నాథా! మీరింకగృహమునుండి బహిర్గతులగుటకు వలనుపడదు! చిరవిశ్రామభోగమనుభవింతురుగాక! శ్రీజగన్నాథుఁడు శ్రీవారి తపోఫలమవశ్యమొసంగును!—ఆతఁడు కర్మఫలదాత! మకరోద్యానమునఁ దృషితప్రాణముతో మీరాగమనము నిరీక్షింతును!

గంగే—దేవీ! నేనిప్పుడు రాజవాహినీయుతుఁడనై శ్రీజగన్నాథాలయమున కరిగెదను! మఱలివచ్చినంతనే నిన్నుఁ గలియఁగలను! (నిష్క్రమింతురు.)

---

శ్రీరస్తు.

# రుధిరస్రవంతి.

## పంచమాంకము.

:-o-:

### 1 వ రంగము.

అంతఃపురము.

ప్రవేశము:—రాణీపార్వతీదేవి.

గీ. ఐదునాళ్లయ్యెఁ గురరి దుఃఖార్తయగుచు
నరచుచున్నది కేళీవనాంతరమున!—

సరియె! కాలాతీతమైనది! అదిగో!

ఝల్లురన మేను అలచంద్రశాలపైనిఁ
గూయుచున్నది గుహుగుహూ యని గుడ్లగూబ!

(నలువైపుల జూచి, గోడకువ్రేలాడు కరవాలమును దిలకించి) ఆహా! ఖడ్గరాజమా! పరమబంధూ! స్వాగతము!

గీ. శత్రుమర్దన వ్రతమందు సఖుఁడవీవు!
పాపభంజనవ్రతమున బంధువుఁడవు!
కష్టజీవుల పాలిటి కల్పలతవు!
తోడుపడ రమ్మ! నీకుఁ జేసెదోయి మోడ్తు!

(దానిఁగైకొని కన్నుల నద్దుకొనును.)

ఓ దేవతలారా! కలియుగమున స్వయముగా మీరీభూతలమున కార్యసాధనమొనరింపరనియు, మానవహస్తమున నిజేచ్ఛఁ బరిణతమొందింతురనియు నార్యులు చెప్పుదురు! నేఁడు నే నీకటారి చేఁబూని మహత్తరకార్యమొనరింప నెంచితిని!—

గీ. ఈకటారిని బూని కాఁకవింతు, భూత
లమునఁ బెటిగిపోయిన భారకలాఘువంబు!—

బాహుగుణశీల, ముష్టికౌశల్య వడిన
శ్రీభతోడి దుఃఖప్రతిశోధనంబు!—
పరమగుణరాశి, యపరూపకస్వర్ణనలిని,
ప్రణయరాజ్యాధిదేవత, శ్రీ రత్నదుర్గ
రాకుమారీసతీశ్వసంకరక్షణంబు !

ఓజగన్నాథా! నేనబలను ! కేవల మర్త్యమాత్రిల కశక్యమగు నీకార్యమును సమగ్రముగాఁ దీర్ప నీవే నాయందావేశింపుము ! (కొంతవడి మిన్నకుండును.)

(దేవాలయమునుండి సుదర్శనప్రభ రొంగసివచ్చి కటారిలోఁ గలిసిపోవును !

(కటారిని క్రిందఁబెట్టినమస్కరించి)

ఓకరవాలరాజమా ! నీకిదే ప్రణమిల్లుచున్నాను ! నామనోసంకల్పమున కనుకూలముగా వర్తింపుము ! (ఆలించి) అదిగో ! అభయంకరరాక్షసమూర్తి పుణ్యాలయమునుండి మగుడివచ్చుచున్నాఁడు ! విజయవాద్యములు మిన్నుగలంచివేయుచున్నవి ! నేనింక కార్యతత్పరనై యుండెదను !

(నిష్క్రమించును.)

---

## 2 వ రంగము.

వాకరోద్యానవనము.

ప్రవేశము :— రాణీపార్వతీదేవి.

పా— అదిగో !

గీ. హాస మోఁకకంగ కుటిలకేటాక్షుముందు,
ఆడుకొను కరిణీసమూహంబుఁ గదియు,
మత్తమాతంగమల్లంబు శ్రీ మహిమ నెగడి,
వచ్చుచున్నాఁడు వసుమతీవల్లభుండు !

గంగే—(ప్రవేశించి) ఆహా ! ఈలీలోద్యాన మెంత రమణీయము ! మకరాంకుని కేళీభవనమువలె విరాజిల్లుచున్నది ! దేవితోఁ గొంతవడిబుచ్చి ప్రమోదభవనమున రత్నపురరాకుమారికారత్నమును వీక్షింపఁబోయెదను ! ఆహా ! ఆసౌభాగ్యమును వర్ణింపనలవికాదు ! (ఉపక్రమించి) అదిగో ! పార్వతి, సువర్ణాలంకారసుశోభిత !



(సమీపించి) పార్వతీ ! ఆలయమునుండి యిప్పుడే బయలువెడలితివి !

పా— నాథా ! (తనలో) హా ! ఈపాపస్వరూపమును నాథా ! యనిపిలుచుటకు పూర్వజన్మమున నెట్టిఘోరతరకృత్య మొనరించితినో కదా ? (ప్రకాశముగా) విజయాంకులగు శ్రీవారియెడ దేవుఁ డనుకూలుఁడు !!

గంగే— రాజ్ఞీ ! నేను దేవాలయప్రవేశ మొనరించి యథావిధి శ్రీజగన్నాథస్వామిని సందర్శించితిని ! అరక్తనేత్రుఁడై ఖలదేవుఁడు నన్నుపేక్షించెను ! సువర్ణగాత్రి సుభద్రాదేవి పెడమొగము బెట్టెను ! శ్రీజగన్నాథుని సుశోభనములముఖమున వరుణారేఖలు భయంకరముగాఁ జూపట్టెను ! అతని విస్ఫుటనయనయుగళినుండి విస్ఫులింగములు వర్షించెను !— దేవీ ! ఇందులకుఁ గారణమేమి ?

పా—(తనలో) హా ! పాపీ ! ఏమియు నెఱుఁగనియట్లు నన్నడిగెదవా ? (ప్రకాశముగా), నాథా ! అమానుషఘటన మేదియో జరిగియుండును !— అదిగో ! అటుచూడుడు ! నారీమణులు కోలాటమాడుచున్నారు ! విద్యుద్దీపకాంతిప్రవాహమున వారెట్లు మెఱసిపోవుచున్నారో ! నాథా ! అటుచూడుము ! వసంతకేళీలాలసులగు నవలాశిరోమణులు ! ఆహా ! అల్లదే నృత్యగీతానిరతులగు భూలోకదేవకన్యకలు ! రాజేశ్వరా ! అటుచూడుము ! మాధవీమంటపసమీపమున మనోహరమగు నుయ్యాల కట్టఁబడియున్నది ! మన మచ్చటి కేగుదము ! (ఉపక్రమింతురు.)

(రాజు ఉయ్యాలలోఁ గూర్చుండును ; రాణి మెల్లమెల్లన నూఁచును.)

పా— నాథా ! ఎన్నాళ్లకు మీపునస్సందర్శనము ?— మఱి మీ రెన్నఁడు నెందు నరుగరాదు !

గంగే— దేవీ ! సమగ్రరాజ్యము నాపదానతమయ్యెను ! నే నికనెందు నరుగనక్కఱలేదు !

పా—(సవ్యాజము) ఇదిగో ! ఈపుష్పమాలికలచే మీహస్తపాదాదిబంధన మొనరించెదను !

గంగే—(సవ్యాజము) దేవీ ! నీయిష్టమే కానిమ్మ !

పా—(బంధించి, మెల్లననూఁచి, కరవాలమున నాతనిఁ బొడుచును).

గంగే— హా ! హతోస్మి ! హతోస్మి !

(రక్తప్లావితుఁడై క్రిందఁ బడిపోవును.)

[యువరాజు, మంత్రి, పురోహితుఁడు పరుగెత్తి ప్రవేశింతురు]

మంత్రి— ఓపరమసుందరీ ! అలులాయితకుంతలా ! పార్వతీదేవీ ! ఈదారుణమేమి ?

ఆరక్తనయనవై రాజశవమును జూతువేమి ? అమ్మా ! శాంతింపుము ! ఆఁడుదాన విది నీకుఁ దగునా ?

అనంగ—హా ! తండ్రీ ! ఎంతలో నెంతమార్పు !

గీ. ఉత్సుకమునఁ బారిన అరుణోదకంబు,
శోభ చెడి వెల్లిగొను రాజశోణితంబు,
పద్మనేత్రిలు విడుచు బాష్పములజాలు,
కలికి యుద్యానవనమునఁ గలిసిపోవు !

పు—(భయముతో వణఁకుచు) మాహేశ్వరీ ! సంహారరూపిణీ ! శాంతింపుము!

పా—(అనంగభీము నుద్దేశించి) కుమారా ! ఇదిగో ! రక్తసిక్తమై పడియున్న యీ మాంసపిండమును జూడుము ! ఈజ్వలితాగ్ని సంసారమును గాల్చి వేయుచుండెను! వీని తృష్ణకు సంసారము చాలకుండెను ! వీని యుత్పీడనమున సంసార మేడ్చుచుండెను ! అహంకారమదమున వీఁడు సతీమణీసతీత్వమునకును, నిర్దోషకన్యామణీజీవనమునకును హాలాహలమయ్యెను ! ఇంత దురంతపరితాపకార్య మొనరించిన దీమాంసపిండము !—నేను స్వామిహత్య జేసితిని ! అందువలన నేనరకమున కేఁగవలయునో, యానరకక్లేశము నాహ్లాదపూర్వకముగా గ్రహించుట కేను సన్నద్ధను ! స్వర్గప్రాప్తినిమిత్తము నే నీనరరాక్షసు నెడ భక్తి నెఱపు స్వార్థపరురాలను గాను ! ఈపాషండునకు నూరుప్రాణములున్నను నే నబలనయ్యు వీనిని ధ్వంస మొనరింపఁగలను ! ఒక్క విద్యుల్లత మహోన్నతపర్వతశతశృంగములను చూర్ణ మొనరింపఁజాలదా ?

కుమారా ! ఈరాక్షసుఁడు స్వహస్తరోపితవృక్షచ్ఛేదనప్రతిజ్ఞాపాలన మొనరించెను. ఈరాక్షసుఁడు—హా ! కుమారా ! ఆలించిన నిలువునీరయ్యెదవు !—ఈరాక్షసుఁడు కౌశల్యాకుమారీకన్యాత్వమపహరించెను ! ఆయనాథబాలికను ససంతానముగా నిహత మొనర్చెను! కుమారా ! నీప్రాణభగిని, నాప్రాణదుహిత, కౌశల్య మఱియీలోకమున లేదు ! స్వకర్మార్జితఫల మనుభవింపఁజేయుటకును, ఈ భూభారము హరింపఁజేయుటకును, మృత్యురూపిణిని జేసి యీయబలను త్రిజగన్నాథస్వామి పంపించినాఁడు !

ఈపాపకర్ముఁ డీముహూర్తమున మఱియొకపాపసంకల్ప మొనరించుచుండెను ! వీఁడు మరణింపకుండిన కౌశల్య యేదుర్దశానుభవ మొందెనో, రత్నపురరాకుమారియు నట్టియవస్థయే యనుభవించియుండును !—



నే నీతని వధింపలేను ! నాచేతిలో స్వయంసుదర్శనచక్రమే యీమహత్తర కార్య మొనరించెను !

కుమారా ! ఇటురమ్ము ! ఈరక్తసిక్తకిరీటమును నారక్తహస్తములతో నీతరుణ మూర్ధమునఁ బెట్టుచున్నాను. రాజ్యరమామణి కనుకూలుఁడవై యభ్యుదయ మొందుము ! (కిరీటమును కుమారునితలపైఁ బెట్టును.)

(కరవాలమునుండి విద్యుత్కాంతి యాకసమున కెగయును.)

హా ! కౌశల్యా ! కౌశల్యా ! నాప్రాణసంజీవనీ ! ఎందున్నదానవే ? హా ! తల్లీ ! హా ! (మూర్ఛిల్లును. పరిచారిక లుపచారము సేయుదురు.)

(ప్రమోదభవనమునుండి యార్తనాదము.)

యు—మంత్రీ ! ఇప్పుడే వచ్చెదను ! (పరుగెత్తును.)

---

## 3 వ రంగము.

## ప్రమోదభవనము.

ప్రవేశము:—విషపాన మొనరించి యున్నపూర్ణ.

అన్న—హా ! ప్రాణములారా ! తెగిపొండు ! నావంటి హతభాగిని నాశ్రయించియేమి సుఖము ననుభవింతురు ? సుఖమా ! లేచిపొమ్ము ! ప్రణయమా ! నీకిదే తుదివందనము ! హా ! హా ! (క్రిందఁ బడిపోవును)

[అనంగభీముఁడు పరుగెత్తి ప్రవేశించును]

అనం—ఓవనితా ! నీకేమాయెను ? నీ వేటికిట్లు లాక్రందన మొనరింతువు ? అయ్యో ! నీవదన మేటికి కళావిహీనమైపోయినది ?

అన్న—ఓనాజీవనసంధ్యతారా ! సంధ్యతారాసందర్శనమున నెట్లు సంధ్యాదేవి పశ్చిమార్ణవమున మునిఁగిపోవునో, నేను నిన్నుఁ జూచుచు అనంతజీవనసముద్రమున మునిఁగిపోవుచున్నాను ! నేనిప్పుడు విషపాన మొనరించితిని ! ప్రాణము పోవుచున్నది !—నాయంత్యప్రార్థన మిది ! ఓవీరపురుషా ! నీసుశీతలపాదమును నాఘూర్ణితమస్తకమున నుంచుము !—ఇంకేమికలదు ?—పోయివచ్చెదను ! నన్ను మఱువవలదు ! నాథా ! నన్ను—మఱువ—వలదు !! (మరణించును.)

అనంగ—హా! సుకుమారగాత్రీ! ఎంతలోఁ గన్నుమూసితివి! నీవంటి దివ్యసుందర్ని, అకాలదుర్మరణముఖమునఁ బడవలసెనా!—హా! విధీ! నీచేఁత లగమ్యగోచరములు!—మంత్రీ! ఏమట్లు పరుగెత్తివచ్చితివి?

మంత్రి—(ప్రవేశించి) రాజేశ్వరా! రాణీపార్వతీదేవి రాజభవనమున మాయమైపోయెను! అపూర్వచరిత్ర యెటుండెనో, యెవ్వ రెఱుంగఁజాలరైరి!

అనంగ—హా! మాతా! నన్నీరుధిరప్రవంతిలో విడనాడి నీవస్తమించితే!—హా! విధీ! నీవెంతకటికివాఁడవు! జననీజనకులు రక్తపాతమున నసువులు విడచిరి! మనోహారిణి రత్నపురరత్నహారము దుర్మరణమొందెను!—హా! రక్తకిరీటమును ధరించి నేనేకాకి నైపోతిం! హా! విధీ! నీయమోఘశక్తి కిదిగో నమస్కారము! నీవెందీ ద్వీప నందేఁగవలయును!—మంత్రీ! ఈరక్తవిధానము పూర్తియైనది! సార్వభౌముని మృతకళేబరమున కుచితసంస్కార మొనరింపవలయును. రత్నపుర సుందరీమణికి సువర్ణసమాధిలో నిక్షిప్తమొనరింపవలయును. మన మేగుదము పద!

(నిష్క్రమింతురు.)

సమాప్తము.




తా॥సం 212
తెం ...

